# నా మాట

కాకతి గణపతిదేవచక్రవర్తి విధేయ సామంతులలో కాయస్థ గంగియసాహిణి ప్రథమ గణ్యుడు మహారాష్ట్రము నుండి ఆంధ్రావనికి వలస వచ్చి, వలనాటిసీమలో కొంతభాగ మాక్రమించి, పాలించుచు, గణపతిదేవమహారాజు అభిమానమునకు పాత్రుడై, పానుగల్లు మొదలు మార్జవాడివరకు గల విశాల భూభాగముపై నాధిపత్యము వహించి, బాహత్తరి నియోగాధిపతి పదవి నలంకరించి, అనేక దేవాలయముల కగ్రహారము లొసంగి ప్రజోపయోగనిర్మాణములను చేపట్టి నిర్వహించిన కాయస్థ గంగయసాహిణి అపరిమిత బలపరాక్రమ సంపన్నుడు

గంగయసాహిణి, అతని మేనల్లుండ్రగు జన్నిగ, త్రిపురాంతక అంబదేవులు పల్లూరు, గండికోట రాజధానులుగా ఒకరి తరువాత ఒకరు క్రీ శ 1230 నుండి క్రీ శ 1308 వరకు పాలించి యుండిరి

కాయస్థరాజులు, రాజవంశపు స్త్రీలు, దండనాథులు, అమాత్యులు అనేక దేవాలయములను నిర్మించి, పూజాదికములకు, ధూపదీపనైవేద్యములకు, అంగరంగ భోగములకు, బ్రాహ్మణులకు అనేక దానము లొసంగినారు సమ్యక్ప్రజాపాలన మొనర్చి తమ కీర్తిప్రతిష్ఠల నినుమడింపజేసికొనినారు

గణపతిదేవ, రుద్రమహాదేవుల శత్రువులను యుద్ధములందు నిర్జించి, అరివీరభయంకరులై, కాకతి సామ్రాజ్య పశ్చిమ సరిహద్దులను రక్షించు బాధ్యత వహించి ఆంధ్రదేశ చరిత్రలో సుస్థిరస్థాన మాక్రమించిన కాయస్థ ప్రభువులు ప్రశంసనీయులు

కాయస్థ రాజుల ఆరాధ్య దైవము త్రిపురాంతక మహాదేవుడు ఈ వంశీయులకు సంబంధించిన 30 శాసనములలో 11 శాసనములు త్రిపురాంతక క్షేత్రమందున్నవి

కాయస్థ ప్రభువులలో గంగయసాహిణి, జన్నిగదేవుడు త్రిపురాంతకుడు కాకతీయుల విధేయ సామంతులు కాని అంబదేవ మహారాజు కాకతి శత్రువులతో స్నేహ మభిలషించి, కాకతి రాజ్య భాగముల నాక్రమించి విశాల స్వతంత్ర కాయస్థ రాజ్యమును నెలకొల్పినాడు కాకతి రుద్రమదేవికి వ్యతిరేకముగా పోరాడి, 72 మంది నాయంకరుల నోడించి దుర్నిరీక్ష్య తేజో విరాజితుడై, కృష్ణానదికి దక్షిణమందున్న సమస్త రాజన్యులను జయించి దిగంత కీర్తినార్జించినాడు

కాయస్థ రాజులకు సంబంధించిన సంక్షిప్త చరిత్రతోపాటు 27 శాసనము లీ గ్రంథమున చేర్చబడినవి సామంత మాండలిక, మహా సామంతాధిపతుల చరిత్రలను ప్రకటింపవలెనను భావమున కందూరి చోడ, రేచర్ల, చెఱకు రాజవంశీయుల చరిత్ర గ్రంథము లిదివరకే ప్రకటింపగలిగినాను ఇది కాయస్థ రాజులకు సంబంధించిన గ్రంథము

బొందుగుల గ్రామ సర్పంచుగను ఆలేరు పంచాయతీ సమితి అధ్యక్షులుగను, నల్లగొండ - రంగారెడ్డి జిల్లాల సహకార పాడి పరిశ్రమ సమాఖ్య అధ్యక్షులుగను విశేషమైన అనుభవము గడించి, సమున్నత స్థానమాక్రమించి నయ వినయ సంపదలతో నల్లగొండ జిల్లా ప్రజల ఆదరాభిమానములను పొందిన శ్రీ బొందుగుల నరసింహారెడ్డిగారి కీ గ్రంథము నంకిత మిచ్చినాను గ్రంథమును స్వీకరించుట కంగీకరించిన శ్రీ రెడ్డిగారికి నా హృదయపూర్వక అభివాదములు

ఈ గ్రంథ రచనలో సుప్రసిద్ధ చారిత్రకులు, పరిశోధకులు ప్రకటించిన వ్యాసములు నాకు తోడ్పడినవి ఆయా వ్యాస రచయితలకు నా కృతజ్ఞతలు

నేను కోరినంతనే శ్రమకోర్చి దుర్గి, కారెంపూడి గ్రామములందున్న శాసనముల ప్రతిబింబ ములను తీసి తెచ్చియిచ్చిన యువ మిత్రుడు చరిత్ర పరిశోధకుడు, నకిరేకల్ డిగ్రీ కళాశాల ఆచార్యుడు శ్రీ సూర్యకుమార్ గారికి నా నమస్కృతులు నా పరిశోధనా గ్రంథములను చూచి, ఆనందించి, ఉత్సాహమును, ప్రోత్సాహమును కలిగించుచున్న విద్యాధికులు సమాజ శ్రేయస్సు నాకాంక్షించు సహృదయులు, శ్రీ మందడి కృష్ణారెడ్డి గారికి నా నమస్కారములు

ఈ గ్రంథమున గల ఛాయా చిత్రములను, చక్కగా ప్రచురించి యిచ్చిన శ్రీ ఓంసాయి గ్రాఫిక్స్ అధినేతలు, శ్రీయుతులు రాంరెడ్డి, రాజశేఖర్ రెడ్డి, వారి మిత్రులు శ్రీ వేణుగోపాల్ గారలకు నా కృతజ్ఞతలు

గ్రంథ ప్రచురణలో తోడ్పడిన చిరంజీవులు గోపాలకృష్ణకు, మనోహరికి నా ఆశీస్సులు గంథము ననతి కాలములో ముద్రించి యిచ్చిన పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్ అధినేత శ్రీ శ్రీనివాస్‌గారికి, వారి సహచరులకు నా అభినందనలు

చారిత్రకులు పరిశోధకులు, ఈ గ్రంథమున దొరలిన దోషములను మన్నించి దయతో తెలిపిన మలి ముద్రణమున సవరించుకొనెదనని సవినయముగ మనవి చేయుచు ఆంధ్రదేశమున కీ గంథము నందించుచున్నాను

[redacted]తి నిలయము
[redacted]/1
ంగంపల్లి, హైదరాబాదు - 500 027

— వి ఎస్ శాస్త్రి

# విషయ సూచిక



## కాయస్థ రాజుల శాసనములు

— o —

# అంకితం

నిరాడంబరుడు

సౌజన్యమూర్తి

శ్రీకొండగుల నరసింహారెడ్డిగారికి

అభిమానముతో

—వి. ఎన్. శాస్త్రి

# కాయస్థ రాజులు

మహాసామ్రాజ్యస్థాపకులైన కాకతి వంశీయుల సామంతులలో కాయస్థరాజు లెన్నదగిన వారు వీ రాంధ్రదేశమునకు వచ్చి రాజ్యస్థాపన మొనర్చుకొనినారు కాకతి తూర్పుగాంగ వంశీయుల పాలనా కాలమున కాయస్థులు సామంతులుగను, మాండలికులుగను, సేనా నాయకులుగను, దండనాథులు గను, అశ్వసైన్యాధ్యక్షులుగను వ్యవహరించినారు

మహారాష్ట్రమున గల కాయస్థ కుటుంబములవారిలో కొందరు ఆయుధోపజీవులై జీవిక సాగించుట కాంధ్రావని కేతెంచినారు సహజముగా అశ్వారోహణ విద్యయం దద్వితీయులైన కాయస్థులు వాహిన్యాధీశులుగను, సేనానులుగను, సామంత మాండలికులుగను కాకతి సామ్రాజ్యమున స్థిరపడినారు

కాయస్థ స్త్రీల నామాంతమున 'బాయి' పదము కనిపించును మహారాష్ట్రమున సర్వసాధారణ ముగా 'బాయి' పదాంతనామము స్త్రీలకుండును పురుషుల నామములు ఆంధ్రదేశీయుల పురుషుల నామములవలె నుండును కాని కొన్ని పేర్లు దేవపదాంతములుగ కనిపించును నామదేవ, మాయిదేవ, అంబదేవ, త్రిపురారిదేవ, జన్నిగదేవాది పురుషుల పేర్లు శాసనములందు కనిపించుచున్నవి

కాయస్థులు శివపూజా ధురంధరులు ముఖ్యముగా త్రిపురాంతక మహాదేవుని పాదపద్మా రాధకులు ఈ వంశీయు లొసంగిన దాన శాసనములలో నత్యధికము త్రిపురాంతకేశ్వరుని అవసరము లకు, అంగరంగ భోగములకు ధూపదీప నైవేద్యాదుల కొసంగబడినవే

కాయస్థరాజుల చరిత్ర నిర్మాణమునకు వారు, వారి స్త్రీలు, మంత్రి సామంతాదులు ప్రకటించిన శాసనములు ముఖ్యాధారములుగ నున్నవి ఇవిగాక, సమకాలిక రాజవంశీయుల శాసనములు, దేవాలయములు, దుర్గములు, కట్టడములు-నిర్మాణములు, శైవమఠాధిపతులు, సమకాలిక రాజవంశీయుల చరిత్రలు, సాహిత్యము— గ్రంథములు కాయస్థరాజుల చరిత్ర రచనలో దోడ్పడుచున్నవి

**శాసనములు :-** కాయస్థరాజులు, వారి సామంత మాండలికులు మహామాత్యులు, రాణివాసపు స్త్రీలు వేయించిన శాసనము లిప్పటివరకు ముప్పదికి పైగా లభించినవి అందు

| | | శక సం | క్రీ శ. |
|---|---|---|---|
| 1 | గంగయసాహిణి త్రిపురాంతక శాసనము | 1172 | 1250 |
| 2 | నామదేవపండితుని దుర్గి శాసనము | 1173 | 1251 |

| | | |
|---|---|---|
| 3 | నామదేవపండితుని త్రిపురాంతక శాసనము | 1176 — 1254 |
| 4 | పుష్పగిరి శాసనము | 1176 — 1254 |
| 5 | గంగయసాహిణి త్రిపురాంతక శాసనము | 1177 — 1255 |
| 6 | కమలాబాయి గంగవర శాసనము | 1179 — 1257 |
| 7 | జన్నిగదేవుని త్రిపురాంతక శాసనము | — — |
| 8 | జన్నిగదేవుని త్రిపురాంతక శాసనము | 1181 — 1259 |
| 9 | జన్నిగదేవుని ఇటిగల్లపాడు శాసనము | — — |
| 10 | జన్నిగదేవుని పొందలూరు శాసనము | 1182 — 1260 |
| 11 | కారెంపూడి శాసనము | 1186 — 1264 |
| 12 | జన్నిగదేవుని అట్లూరు శాసనము | 1190 — 1268 |
| 13 | కరణము నామయ దుర్గి శాసనము | 1191 — 1269 |
| 14 | త్రిపురాంతకుని త్రిపురాంతక శాసనము | 1194 — 1272 |
| 15 | అంబదేవుని త్రిపురాంతక శాసనము | 1194 — 1272 |
| 16 | నాగేశ్వరబాయి అక్కలరెడ్డిపల్లి శాసనము | 1205 — 1283 |
| 17 | అంబయరెడ్డి త్రిపురాంతక శాసనము | 1210 — 1288 |
| 18 | అంబదేవుని త్రిపురాంతక శాసనము | 1212 — 1290 |
| 19 | అంబదేవుని త్రిపురాంతక శాసనము | 1212 — 1290 |
| 20 | ఘోడెరాయ గంగయదేవుని బ్రాహ్మణపల్లి శాసనము | 1212 — 1290 |
| 21 | అంబదేవుని త్రిపురాంతక శాసనము | 1213 — 1291 |
| 22 | ఖదేవుని త్రిపురాంతక శాసనము | 1213 — 1291 |
| 23 | అంబదేవుని రాజంపేట శాసనము | 1214 — 1292 |
| 24 | త్రిపురారిదేవుని వరికుంట శాసనము | 1226 — 1304 |
| 25 | త్రిపురారిదేవుని శేబాక శాసనము | 1226 — 1304 |

ఇవిగాక, నీలగంగవరము, చిట్యాల, పలనాటి సీమలోని గుండ్లూరు, పాల్వాయి తదితర శాసనములు కాయస్థరాజుల చరిత్ర నిర్మాణములో తోడ్పడుచున్నవి కాకతీయ, పాండ్య తెలుగుచోడ, యాదవ రాజవంశీయుల శాసనములు, మాండలిక సామంతరాజుల శాసనములు వీరి చరిత్రరచన కుపకరించుచున్నవి

**దేవాలయములు** – కాయస్థరాజులు శివపూజా ధురంధరులు త్రిపురాంతక మహాదేవుని భక్తులు పీరికి సంబంధించిన 12 శాసనములు త్రిపురాంతకములో లభించినవి కాయస్థ గంగయ సాహిణి ధర్మపత్ని కమలాబాయి పుష్పగిరిలో తన పేర కామలేశ్వరుని ప్రతిష్టించినది పుష్పగిరి లోని త్రికూటేశ్వరాలయమును నిర్మించి, మోరట పట్టణాధీశుడగు అల్లుగి తనయ హాచలాంబ, హాచలేశ్వరుని, పల్లవ రాజగు ఖండేయరాయ, పల్లవేశ్వరుని, కమలాబాయి కామలేశ్వరుని ప్రతిష్టించిన సందర్భమునందీ శాసనమును వేయించిరి

గంగయసాహిణి మహామాత్యుడు నామదేవపండితుడు ఇతడు పలనాటి సీమలోని దుర్గి గ్రామమున తన తండ్రి వాయిపండితుని పేర వం కేశ్వరుని ప్రతిష్టించెను

దుగ్య పట్టణమున జన్నిగదేవ మహారాజు పాలించు కాలమున కరణము నామయ శ్రీ గోపీ నాథదేవరను ప్రతిష్టచేసి దేవర అంగరంగ భోగములకు, పూజాదికములకు, ధూపదీప నైవేద్యములకు భూమి దానమిచ్చుచు నొక శాసనమును వేయించెను

కాయస్థ త్రిపురారిదేవ మహారాజునకు పుణ్యముగా గౌరేశ్వరబాయి అక్కలరెడ్డిపల్లిలో శివా లయమును నిర్మించి, వృత్తులను పెట్టు సందర్భమునందొక శాసనమును వేయించెను

ఈ ఆలయములను నిర్మించుటయే గాక, త్రిపురాంతకము, సిద్ధవటము, పుష్పగిరి, వరికుంట, లేబాక, రాజంపేట, దుర్గి, సత్రశాల వంటి ప్రదేశములందు దేవాలయములకు శివగురువులకు దానమి చ్చుచు కాయస్థరాజులు శాసనములు వేయించిరి కాకతి రుద్రమ పాలించునాటికి శివాలయములతో పాటు వైష్ణవాలయములు సైతము నిర్మింపబడినవి ఆ కాలమున రాయలసీమ, తెలంగాణ ప్రాంతము లందు గోపీనాథ దేవాలయములు వెలసినవి

**దుర్గములు** – కాయస్థ రాజుల దుర్గములలో చిట్యాల, పెనుగల్లు, గండికోట వల్లూరు వంటివి ముఖ్యమైనవి ఈ దుర్గములలో కొన్ని నశించినవి మరికొన్ని శిథిల రూపమున నున్నవి ఈ దుర్గముల నిర్మాణము దుర్గ రక్షణ విధానము, కాయస్థ రాజుల యుద్ధ తంత్రములను, సైనిక వ్యవస్థను తెలిసి కొనుటలో దోడ్పడును

**కట్టడములు – నిర్మాణములు** – కాయస్థులాంధ్రదేశమును పాలించు కాలమున దేవాలయలనే కాక అనేక కట్టడములను, నిర్మాణములను చేపట్టియుండిరి గండికోట, వల్లూరు – మనోరథపురములే కాక, రాజాంతఃపురములు, రాజసౌధములు, గజాశ్వశాలలు, చెఱువులు, కుంటలు, ప్రజోపయోగ నిర్మాణములు వారి ప్రజాహిత కార్యములను, నిర్మాణ కౌశలమును వెల్లడించుచున్నవి

**శైవ మఠాధిపతులు** - కాయస్థ రాజులు శైవమతానుయాయులు అనేక దేవాలయములను నిర్మించుటయే గాక, ప్రసిద్ధమైన ఆలయముల కగ్రహారము లొసంగిరి

ఘోడెరాయ గంగిదేవయ, ఉత్తమ శివగురుదేవుడు అతని తనయుడు సిద్ధేశ్వరుడు, నంద శివులు, త్ర్యంబక శివాచార్యులు, కొమార శివులు, రుద్ర శివులు, శాంతపూర్వ శివదేశికులు తదితరులు శైవ మఠములను విద్యాపీఠములను నిర్వహించి కాయస్థరాజుల వలన అగ్రహారములను పొందిరి ఈ మఠాధిపతుల చరితల వలన కాయస్థ రాజుల భక్తి వితరణ గుణములు తెలియుచున్నవి

**సమకాలిక రాజవంశీయుల చరిత్రలు** - కాయస్థులు కాకతి రాజవంశీయుల విధేయ సామంతులు గంగయ సాహిణి మూడవ మేనల్లుడు అంబదేవ మహారాజు కాకతి ప్రభువులతో వైరము కలిగియుండి, పాండ్య సేవుణ, చెఱకురెడ్డి వంశీయులతో సఖ్యముగా నుండి విశాల సామ్రాజ్యమును స్వతంత్రముగ పాలింప గలిగెను కాయస్థుల చరిత్ర రచనలో కాకతి, తెలుగుచోడ, పాండ్య, యాదవ, చెఱకు వంశీయుల చరిత్రలు తోడ్పడుచున్నవి

**సాహిత్యము-గ్రంథములు** - కాయస్థ రాజులు, వారి సామంత మాండలికులు వేయించిన సంస్కృతాంధ్ర శాసనములు ఆ కాలమున వెలసిన గ్రంథములు, వారి సాహిత్య సేవను భాషాభి మానమును వెల్లడించుచున్నవి కల్యాణీ చాళుక్య రాజుల కాలమున వెలసిన గ్రంథముల ననుసరించి ఆ కాలపు రాజులు, అనేక దానము లొసంగినట్లు వెల్లడియగుచున్నది కాయస్థ ప్రభువులు సైతము అట్టి దానములు కావించి తమ కీర్తిని శాశ్వతముగ నిలుపుకొనినారు

క్రీ శ పదియవ శతాబ్దమునుండి 18వ శతాబ్దమువరకు మహారాష్ట్రమునుండి అనేక వంశ ములవారు వివిధ ప్రాంతములకు వలసపోయి, ఆయా ప్రాంతములందు స్థిర నివాసులైరి ఆరెవారు, పెరికెవారు, పట్కారీలు కాయస్థులు, ఆంధ్ర కళింగ దేశములందు జీవనోపాధికై వలస వచ్చియుండిరి క్రీ శ 18వ శతాబ్దారంభమున కొందరు కాయస్థవంశజు లాంధ్రదేశమునకు వచ్చిరి

కాయస్థ గంగయ సాహిణి, తన సోదరి చందూబాయి, బావ అంబష్మాపతి, అర్ధాంగి కమలాబాయితో కలిసి ఆంధ్రదేశ మేతెంచెను కాకతి గణపతిదేవ మహారాజు కాయస్థ గంగయ సాహిణిని ఆదరించి, మాండలిక ప్రభువుగా నియోగించెను అంబష్మాపతి కాకతి గణపతి దేవ మహారాజుచే వెలనాటిసీమ పాలకునిగా నియమితుడై యుండవచ్చును గంగయసాహిణి నేటి నల్లగొండ మండలము లోని చిట్యాల, పానుగల్లు ప్రాంత పాలకునిగా నుండియుండును



త్రిపురాంతక దేవాలయము – అమ్మవారి గుడి





త్రిపురాంతకము – ద్వారపాలకులు

కాయస్థ రాజులు బ్రాహ్మణులుగా భావింపబడినారు కళింగ దేశమున గాంగ వంశీయుల పాలనాకాలమున దండనాయక పదవులు నిర్వహించిన కొందరు కాయస్థకులజులు బ్రాహ్మణులు అట్లే గంగయ సాహిణి అమాత్యుడగు నామదేవ పండితుడు అతని తండ్రి వాయి పండితుడు విప్రకుల సంజాతులు

త్రిపురాంతకము నందున్న అంబదేవ మహారాజు క్రీ శ 1290 నాటి శాసనమున-

"దేవస్య పద్మజనుషో ద్రుహిణస్య కాయాత్
కాయస్థ ఇత్యజనికోప నరేంద్రవంశః [1]

అని యున్నది

శక సంవత్సరము 1212 లేక క్రీ శ 1290 నాటి త్రిపురాంతక దేవాలయ శాసనమున ఆంధ్రదేశ భూభాగముల నేలిన కాయస్థ రాజులు పేర్కొనబడినారు

1 గంగయసాహిణి 2 జన్నిగదేవుడు లేక జనార్దనుడు 3 త్రిపురాంతకుడు లేక త్రిపురారిదేవుడు 4 అంబదేవుడు 5 రెండవ త్రిపురారి లేక త్రిపురాంతకుడు

అంబదేవమహారాజు శక సంవత్సరము 1212 లేక క్రీ శ 1290 నాటి నీలగంగవరము శాసనమున గంగయసాహిణి, అతని సోదరి చందూబాయి అమ్మ, ఆమెభర్త అంబజమ్మాపతి పేర్కొనబడినారు ఇందు గంగయసాహిణి అతని సోదరితోపాటు సోదరి భర్త అంబజమ్మాపతి, వారి తనయులును గంగయ సాహిణి మేనల్లుండ్రుననగు జనార్దనుడు, త్రిపురారి, అంబదేవుడు ప్రస్తావింపబడినారు

అంబజమ్మాపతి శకసంవత్సరము 1166 లేక క్రీ శ 1244లో గుంటూరు జిల్లా పలనాటి సీమలోని కృష్ణానదీ తీరమందున్న సత్రశాలలో నొక శాసనమును వేయించెను అందితడు కాకతి గణపతిదేవ మహారాజు పాదపద్మారాధకునిగా, మండలిక బ్రహ్మరాక్షస, గండపెండార, అతివిషమహయారూఢ ప్రౌఢరేఖారేవంత, దామోదర సైన్యదిశా పట్టాది బిరుదములు గలవానిగ వర్ణింపబడినాడు ఇతనికి జనార్దన, త్రిపురాంతకాంబదేవులను ముగ్గురు తనయులు, పదుమాబాయి అను తనయ ఉన్నట్లు తెలుపబడినది

---

1 త్రిపురాంతక దేవాలయ శాసనములు శా నెం 72 పుట 132_136

పదుమాబాయి, చందూబాయి అంబజ్మాపతుల ఏకైక పుత్రిక, గంగయసాహిణి మేనకోడలు మహామండలేశ్వర బిరుదాంచితురాలు పదుమాబాయి శకసంవత్సరము 1177 రాక్షస కార్తీక శుద్ధ 15 గురువారము సరియగు 18-10-1255లో తన తండ్రి అంబజ్మాపతికి, భర్త లక్ష్మీదేవునికి సుకృతము కలుగునట్లు గుంటూరు జిల్లా పలనాడు తాలూకా పాలువాయి గ్రామమందున్న కాశేశ్వరాలయ జీర్ణోద్ధారము గావించి ఆలయ పూజాదికములకు కొంత భూమిని దానమిచ్చుచు శాసనము వేయించెను

కాయస్థ ప్రభువులు తాము వేయించిన శాసనములందును వారి మంత్రులు ప్రకటించిన శాసనములందును గంగయసాహిణి, జన్నిగదేవాదులు పానుగల్లు మొదలు మార్జవాడివరకు గల సువిశాల సామ్రాజ్యమును పాలించినట్లు తెలిపినారు మరికొన్ని శాసనములందు వీరు పానుగల్లు నుండి కైవారము కోట వరకు గల భూభాగము నేలినట్లున్నది

## కాయస్థ వంశము




పానుగల్లు నల్లగొండ మండలములోనిది ఇచటి చిట్యాల తదితర ప్రాంతమునందు కాయస్థ గంగయసాహిణికి సంబంధించిన శాసనములున్నవి చిట్యాల శాసనము సంస్కృత భాషలో వేయింప బడినది

మార్జవాడి, మహారాజవాడిగా ప్రసిద్ధము రేనాటినే మార్జవాడి యందురు ఇది 7000 రాజ్యము రేనాడు 7 వేల రాజ్యముగా రేనాటిచోళ, వైదుంబరాజుల శాసనములందు పేర్కొనబడినది

కైవారము కోట మైసూరు రాష్ట్రము లేక కర్నాటకములోని కోలారుజిల్లా చింతామణి తాలూకాలోనున్న గ్రామము

నల్లగొండ జిల్లా నల్లగొండ తాలూకా కర్నూలు జిల్లా మార్కాపురము తాలూకా వినుకొండ, పల్నాడు తాలూకాలు నెల్లూరు జిల్లా దర్శితాలూకా కడప జిల్లాలందు కాయస్థ ప్రభువులకు సంబంధించిన శాసనములున్నవి పీరు విశాల సామ్రాజ్యాధినేతలని తెలియుచున్నది

వీరి రాజధానులుగ వర్ధిల్లిన పట్టణములలో, కడప జిల్లాలోని వల్లూరు - వల్లూరు పట్టణము, జమ్మలమడుగు తాలూకాలోని గండికోట - మనోరథపురము పేర్కొనదగినవి

త్రిపురాంతకము, సిద్ధవటము తాలూకాలోని గ్రామములు, వలనాటిలోని దుర్గి, సత్రశాల, పాల్వాయి, గుండ్లూరు పుష్పగిరి, తదితర కడప జిల్లా గ్రామములు, నల్లగొండ జిల్లాలోని చిట్యాల మున్నగు ప్రదేశములందు కాయస్థ రాజుల శాసనములున్నవి ఈ శాసనములవలన కాయస్థ వంశీయుల చరిత్ర, సంస్కృతి రాజ్య విస్తీర్ణము, దాన ధర్మములు, కాకతి, యాదవ పాండ్య, చోళరాజులతో వీరికి గల సంబంధములు తెలియుచున్నవి

**గంగయ సాహిణి -** కాయస్థ రాజులలో మొదటివాడు గంగయ సాహిణి వలనాటి సీమలోని గుండ్లూరు గ్రామమున శక సంవత్సరము 1161 = క్రీ శ 1239 లో గంగయసాహిణి ఒక శాసనమును వేయించెను ఈ శాసనమున గండ పెండార గంగయ సాహిణి యని మాత్రమే యున్నది శాసనము విష్ణు సంక్రాంతినా డీయబడినది గంగయసాహిణికి గల ఇతర బిరుదము లిందు కనిపింపవు ఇది గంగయ సాహిణి తొలి శాసనము

గంగయ సాహిణి మహారాష్ట్రము నుండి ఆంధ్రదేశమునకు వచ్చి, తొలుత వలనాటి సీమలో కొంత భాగము నాక్రమించి యుండెనని భావింపవచ్చును గంగయసాహిణి అతని సోదరి చందూబాయి, బావ అంబమ్మావతి, గంగయ సాహిణి అర్ధాంగి కమలాబాయి, కొంత పరివారముతోను, కొంద రశ్వసైనికులతోను వచ్చి కృష్ణానది దక్షిణ ప్రాంతమందున్న వలనాటి సీమలోని కొన్ని ప్రాంతముల నాక్రమించి యుండెను

అప్పటికి వలనాటి సీమలో మహాభారత యుద్ధము వంటి యుద్ధము సంభవించియుండెను హైహయులు వెలనాటి రాజులు బలహీనులై యుండిరి కాకతి రుద్రదేవుడు మహాదేవుడు దివంగతులు కాగా, గణపతిదేవ మహారాజు కాకతి రాజ్యపీఠ మలంకరించి సామ్రాజ్యమును విస్తరించు ప్రయత్న మందుండెను

గూండ్లూరు శాసనమున కాకతి గణపతిదేవుని ప్రశంస లేదు కావున క్రీ శ 1239 నాటికి కాకతి గణపతి పలనాటిని జయింపలేదని భావింపనగును గంగయ సాహిణి స్వతంత్రునిగనే తన రాజ్య భాగముల నేలుచుండెను

శక సంవత్సరము 1164 నాటి శాసనమందు గంగయ సాహిణి కాకతి గణపతిదేవ మహారాజు ప్రతినిధిగా ఏఱువ త్రిస ప్తతి దేశమును క్రొచ్చెరువుల రాజధానిగా పాలించుచున్నట్లు తెలుప బడినది ఇందు గంగయ సాహిణి అరివీర బ్రహ్మరాక్షస బిరుదము వహించినట్లు పేర్కొనబడినది అనగా క్రీ శ 1242 నాటికి కాకతి గణపతి పలనాటి హైహయ రాజ్యమును కాకతి రాజ్యమున విలీనమొనర్చుకొని గంగయసాహిణి వంటి మాండలికులను తన సామంతులుగ స్వీకరించెనని భావింప వచ్చును

గంగయసాహిణి సోదరి చందూబాయి ఆమె భర్త అంబష్టాపతి అతడు పలనాటిలోని సత్రశాల క్షేత్రమున నొక శాసనమును శక సంవత్సరము 1166 లేక క్రీ శ 1244లో వేయించెను అందతడు కాకతి గణపతిదేవ మహారాజు పాదపద్మారాధకునిగా, మాండలిక బ్రహ్మరాక్షస, గండ పెండార, అతి విషమహయారూఢ ప్రౌఢ రేఖారేవంత, దామోదర దిశాపట్టాది బిరుదములు కలవానిగా వర్ణింపబడినాడు కాయస్థ గంగయ సాహిణి, అంబష్టాపతి అన్యోన్యముగ నుండి కాయస్థ రాజ్యమును పాలించియుండిరని భావింపవచ్చును

అంబష్టాపతి ఏదేని ఒకానొక యుద్ధమున మరణింప అతని పుత్రులగు జన్నిగదేవ త్రిపురాంతక, అంబదేవాదులను, పుత్రిక పదుమాబాయిని గంగయసాహిణి పెంచి పెద్దచేసి సమస్త విద్యలను నేర్పించి తన రాజ్యమున వారికి సమున్నత స్థానము కల్పించియుండును

శక సంవత్సరము 1172 నాటికి గంయసాహిణి గణపతిదేవ చక్రవర్తి కాప్తవర్గములోని వాడైనాడు కాకతి రాజ్యమున ప్రధాన వ్యక్తిగా పరిగణింపబడినాడు త్రిపురాంతకములోని మూలస్థాన బ్రహ్మేశ్వరాలయమున గంగయసాహిణి శక సంవత్సరము 1172 సాధారణ పుష్య శుద్ధ పంచమి గురువారమునాటి మకర సంక్రాంతి పుణ్యకాలమున స్వామి అంగరంగ భోగములకు, కాకతి గణపతిదేవ మహారాజునకు, తనకు ధర్మమగునట్లు దువలి కంపనములోని లోయలపల్లిని, రెడ్లపల్లి పొలము చతుస్సీ మమును సకలాయ సహితముగా, ధారాపూర్వకముగా నిచ్చు సందర్భమున శాసనమును వేయించెను

ఈ శాసనమున గంగయసాహిణి, మహా మండలేశ్వర, బాహాత్తర నియోగాధిపతి, చాతుర్వర్ణ సముద్ధరణ, పశ్చిమ రాయదామోదర సైన్య దిశాపట్ట, ఏంకాంగవీర, వీరావతార, అతి విషమహయా రూఢ ప్రౌఢరేఖా రేవంత, నాయక నారాయణాది బిరుదములున్న వానిగా పేర్కొనబడినాడు

శక సంవత్సరము 1164 నుండి 1172 వరకు అనగా క్రీ శ 1242 నుండి 1250 మధ్య గల 8 సంవత్సరములలో గంగయ సాహిణి అనేక యుద్ధములందు విజయుడై కాకతి గణపతిదేవ మహారాజు మన్ననలకు పాత్రుడై కాకతి రాజ్యమున ప్రముఖ స్థానమాక్రమించి మహా మండలేశ్వరునిగా, బాహత్తర నియోగాధిపతిగా నియమింపబడినాడు గంగయసాహిణికి గల ఈ బిరుదము లేయే యుద్ధము లందు విజయము సాధింపగా వచ్చినవో తెలియకున్నను కొన్ని చారిత్రక సంఘటనల వలన గంగయ సాహిణి కాకతి రాజన్యుం శత్రువులను నిర్జించి పొందెనని భావింపవచ్చును

## పశ్చిమరాయ దామోదర సైన్యదిశాపట్ట -

ఈ బిరుదమును గంగయసాహిణి దామోదరు నోడించి తరిమి పొందెనని యూహింపవచ్చును కాకతి సామ్రాజ్య పశ్చిమ ప్రాంతమందున్న మహారాష్ట్రమును దామోదరుడు పాలించుచుండెను అతడే పశ్చిమ రాయడు కాకతి రాజ్యమునకు పడమర సేవుణరాజ్యమున్నది సేవుణ రాజ్యమే యాదవ రాజ్యము

దామోదరుడు యాదవ రాజు సామంతుడు రాజాజ్ఞానుసార మతడు కాకతి రాజ్య భాగము లపై దండెత్తి కొంత భూభాగమును వశపరచుకొనెను కాకతి గణపతిదేవుని ఆజ్ఞ ననుసరించి కాయస్థ గంగసాహిణి, కాకతి సేనల కాధిపత్యము వహించి దామోదరు నెదిర్చి, యుద్ధమందాతని నోడించి, సైన్యసమేతముగ అతనిని వెన్నాడి తరిమి పారద్రోలెను

గంగయసాహిణి సోదరి చందూబాయి భర్త అంబబ్మాపతి, అతని తనయులు జన్నిగదేవ త్రిపురాంతకాంబదేవులు జన్నిగ త్రిపురాంతకులు, అంబబ్మాపతి, గంగసాహిణికి యుద్ధమునం దండగా నిలిచి, దామోదరు నెదుర్కొని విజయము గాంచుటలో దోడ్పడియుందురు కాయస్థ రాజులందరికి దామోదర సైన్యదిశాపట్ట బిరుదమున్నది సత్రశాలలో శాసనమును వేయించిన అంబబ్మాపతి కిట్టి బిరుదమున్నది జన్నిగదేవ, త్రిపురాంతక దేవులు, గంగయసాణికి రెండు భుజములవంటి వారని శాసనము వలన తెలియుచున్నది [1]

కాయస్థ వంశజులు గణపతిదేవ మహారాజు ఆజ్ఞానుసారము దామోదరునితో యుద్ధ మొనర్చి విజయము సాధించియుందురు

ఈ యుద్ధ విజయానంతరము, కాకతి గణపతిదేవ చక్రవర్తి గంగసాహిణి యెడ ప్రసన్నుడై మహామండలేశ్వర పదవినొసంగి బాహత్తరనియోగాధిపత్యమును, నాయక నారాయణ బిరుదమును,

1 AR No 261 of 1905

అనేక దేశాధిపత్యమును ఇచ్చి గౌరవించి యుండును మహామండలేశ్వర బిరుదము రాజ పదవిని సూచించునది సామంతులు, మాండలికులు, రాజాధిరాజులు సైతము ఆనాడు మహామండలేశ్వలుగ వ్యవరింపబడుచుండిరి

బాహత్తర నియోగాధిపత్య మొక గౌరవ పదవి బిరుదము 72 మంది రాజకీయోద్యోగులపై అధికారమును సూచించునదీ బిరుదము

నాయక నారాయణ బిరుదము కాయస్థ గంగసాహిణికి కాకతి గణపతి దేవుని 72 మంది నాయకులపై గల ఆధిపత్యమును సూచించును గంగయసాహిణి రాజ్యాంగ వ్యవహారములందు గణపతి దేవుని రాజ్యమున సమున్నత స్థాన మాక్రమించియుండును

అనేక దేశాధిపతి బిరుదము గంగయసాహిణికి, కాకతిసామంత మాండలికులపై ఆధిపత్యము వహించు అధికారము కలిగియుండుటనుబట్టి వచ్చి యుండవచ్చును గంగయసాహిణి మంత్రి నామదేవ పండితుడు శక సంవత్సరము 1173 విరోధి ఆశ్వీజ శుద్ధ 13 శుక్రవారము నాడు దుర్గి పట్టణమున వంకేశ్వరుని ప్రతిష్ఠించి, ఆ దేవర అంగరంగ భోగములకు నెయ్యూరి చెఱ్వు సహితముగా దానమిచ్చు సందర్భమునం దొక శాసనమును వేయించెను అందు గంగయ సాహిణి పానుగల్లు ఆది మార్జవాడి వరకు సుఖసంకథా వినోదంబున రాజ్యము చేయుచున్నట్లున్నది

పానుగల్లు నుండి మహారాజవాడి అనగా కడవ జిల్లా వరకు విస్తరించియున్న భూభాగమునకు గంగయసాహిణి ఏలికయని భావింపవచ్చును కాని, పానుగల్లు తదితర ప్రాంతములందు, కందూరి చోడులు, రేచెర్ల రెడ్డివంశీయులు, చెఱకు రెడ్లు తదితర మహాసామంతాధిపతులు, మాండలికులు, సామంతులు పాలించుచున్నను, గంగయసాహిణి వారి రాజ్యములపై గణపతిదేవ మహారాజు ప్రతినిధిగా, ఆధిపత్యము వహించియుండును

త్రిపురాంతకము, దుర్గి, గుండ్లూరు, పాల్వాయి సత్రశాల, నాగులవరము, కడపజిల్లాలోని కడప, పుష్పగిరి, రాజంపేట, కమలాపురము తాలూకాలోనున్న నందలూరు, పొదదుర్తి, గంగవరము గ్రామములందున్న గంగయసాహిణికి, అతని బంధువులకు సంబంధించిన శాసనములు, నల్లగొండ జిల్లాలోని చిట్యాల తదితర ప్రాంతములందు లభించిన శాసనములు, గంగయసాహిణి పానుగల్లాది మార్జవాడి వరకు గల విశాల భూభాగముపై ఆధిపత్యము వహించియుండెననుటకు తార్కాణము

పుష్పగిరిలో యాదవ సింఘనకు సంబంధించిన శాసనమున్నది [1] అందు యాదవరాజు సేనాపతి వర్ణింపబడినాడు "స్వస్తి సమస్త ప్రశస్తి సహితం శ్రీ మన్మహాప్రధానం సమస్త సేనాధిపతి అనేక దేశాధిపతి సకళలక్ష్మీపతి బాహత్తర నియోగాధిపతి గురిదుగ్గ్యమల్ల, పశ్చిమరాయ భోజదేవది సాపట్ట శ్రీమతు ప్రతాప చక్రవర్తి సింగణదేవ దక్షిణ భుజాదండ, నాయక నారాయణ లక్ష్మీదేవ దండనాయకరు అని వర్ణింపబడి యున్నది

యాదవ సింఘణ రాజ్యము కాకతి సామ్రాజ్య పశ్చిమభాగమున వ్యాపించియుండెను లక్ష్మీదేవ దండనాయకునికి గల పై బిరుదము లాతనిని జయించుటవలన కాయస్థ గంగయసాహిణి అతని బావమరిది అంబజ్మాపతి, మేనల్లుండ్రు జన్నిగ త్రిపురాంతకాంబదేవులు ధరించియుందురు ఈ బిరుదములు కాయస్థ రాజులందరును వహించియుండిరి

**రక్కసగంగడు** - రక్కసగంగడు కలుకడ పురవరాధీశ్వరుడు గొప్ప శూరుడు కాయస్థ గంగయసాహిణి కితనితో వైరమేర్పడుటకు కాకతి ప్రభువుల రాజ్య విస్తీర్ణ కాంక్ష కారణము కావచ్చును కాకతి గణపతిదేవ చక్రవర్తి గంగయసాహిణి నాదరించి, మహా మాండలికునిగా గుర్తించి కాకతి రాజ్య పశ్చిమ భాగములను సంరక్షించు భార మప్పగించియుండును

శక సంవత్సరము 1176 = క్రీ శ 1254 నాటి నామదేవ పండితుని త్రిపురాంతక శాసనమున గంగయసాహిణికి రక్కసగంగ దిశాపట్ట బిరుదమున్నట్లు తెలుపబడినది

జన్నిగదేవ మహారాజు సర్వాధికారి మాయిదేవుని కారెంపూడి శాసనము శకసంవత్సరము 1186 రక్తాక్షి మాఘ శుద్ధ 15 గురువారము నాటి సోమగ్రహణ పుణ్యకాలమం దీయబడినది ఈ శాసనమున జన్నిగదేవునికి రక్కసగంగ బెంకొండగండ బిరుదమున్నట్లు తెలుపబడినది అనగా రక్కసగంగని వెన్నాడి తరిమిన శూరుడని అర్థము మావనంకకార, అను బిరుదము గంగయసాహిణి అంకకాడను భావమున జన్నిగదేవునకు వాడబడినది

జన్నిగదేవ, త్రిపురాంతక దేవులు, గంగయసాహిణి బాహుద్వయము వంటివారని తెలియుట వలన, వీరు కలిసి రక్కసగంగని యుద్ధమం దోడించినట్లు భావింపనగును

వైదుంబ రాజగు రాయదేవ మహారాజు, రక్కసగంగ బిరుదాంచితుడు సిద్ధవటము తాలూకా లోని జ్యోతి శాసనమును, రాయదేవ మహారాజు నిజభృత్యుడగు చింతరామ నాయకుడు శకవర్షము

1 ఆం ప్ర ప్ర ప్రచురణ కడప జిల్లా శాసనములు శా నెం 188

1169 = క్రీ శ 1247 ప్లవంగ జ్యేష్ఠ శుద్ధ త్రయోదశి శనివారము జ్యోతినాథుని గుడి గోపురము తకప్రోల నిరుగల దేవుని గుడి కట్టించి చేటూరులో రెండు చెఱువులు త్రవ్వించి అగ్రహార మొసంగు సందర్భమున వేయించెను

ఈ శాసనమున రాయదేవ మహారాజు "మహామండలేశ్వర త్రైలోక్యమల్ల భుజబళ వీర నారాయణ అవుదుంబరాభరణ, సిద్ధవట దేవర దివ్య శ్రీపాద పద్మారాధకునిగ వర్ణింపబడినాడు అదే శాసనమున రక్కస గంగరసదేవ మహారాజులు ప్రిథివీ రాజ్యము చేయుచుండ అని యున్నది

శకసంవత్సరము 1154 విజయ వైశాఖ శుద్ధ సప్తమి ఆదివారము నాటి రాయచోటి తాలూకాలోని అబ్బవరము శాసనమున రాయదేవ మహారాజు సమధిగత పంచమహాశబ్ద, మహా మండలేశ్వర అనేక సమర సంఘట్టణోపలబ్ధమాన విజయలక్ష్మి సమాలింగిత విశాళవక్షస్థళ, క్షత్రియ పవిత్ర భువనత్రినేత్ర, పాండ్య గజకేసరి, అవుదుంబరాభరణ, వైరిసంహరణ, సిద్ధవట దేవర దివ్య శ్రీపాద పద్మారాధక వరఎల సాధక శ్రీ మత్త్రైలోక్యమల్ల భుజబల వీర నారాయణ నిశ్సంక ప్రతాప చక్రవర్తి అని ప్రశంసింపబడినాడు ఈ శాసనము క్రీ శ 1232 నాటిది రాయదేవ మహారాజు మార్జవాడిలోని యాండపురము రాజధానిగా పాలించుచు అబ్బాపురమున గల అబ్బేశ్వర దేవర అంగ రంగ భోగముఒక గంగ సముద్రమును ధారాపూర్వకముగ దానమిచ్చు సందర్భమునం దీ శాసనమును వేయించెను

రాయచోటి శాసనము శక సంవత్సరము 1155 = క్రీ శ 1233 నాటిది మారయపాడి (మార్జవాడి)లోని ఆండపూరు జనార్దన స్వామికి తన పేరున రాయనారాయణ పుత్తూరను గ్రామమును రాయదేవ మహారాజు దానమిచ్చినట్లు ఈ శాసనము తెలుపుచున్నది

రక్కస గంగ రాయదేవ మహారాజు శ సం 1154 నుండి 1169 సంవత్సరముల మధ్య మార్జవాడి, పొత్తపినాటి సీమను నేలినట్లు భావింపనగును రక్కస గంగడు సిద్ధవట ప్రాంత పాలకుడని జ్యోతి శాసనము విశదపరచుచున్నది జ్యోతి ప్రాంతము మార్జవాడి లోనిది నామదేవ పండితుని శకసంవత్సరము 1173 నాటి దుర్గి శాసనము ననుసరించి, గంగయసాహిణి, పానుగల్లు మొదలు మార్జవాడి వరకు గల దేశము నేలుచుండెనని తెలియుచున్నది

శకసంవత్సరము 1162 నాటి గుండ్లూరు శాసనము, శకసంవత్సరము 1172 నాటి త్రిపురాంతక శాసనము, గంగయసాహిణి పానుగల్లాది మార్జవాడి వరకు వరకు గల భూమిని పాలించు చున్నట్లు తెలుపుటలేదు

శకసంవత్సరము 1169 నుండి శకసంవత్సరము 1173ల మధ్య గంగయసాహిణి రక్కస గంగరాయదేవ మహారాజు నోడించి అతని రాజ్య భాగములను స్వాధీనపరచుకొని యుండును రక్కస గంగనితో జరిగిన అన్ని యుద్ధములందు గంగసాహిణి విజయము సాధించినట్లు తోచదు

రక్కసగంగరాయదేవ మహారాజు బలపరాక్రమోపేతుడు అపారసైన్య మున్నవాడు అతడు ఒకమారు గంగయసాహిణిని సంపూర్ణముగ నోడించి నిరాశ్రయునిగ చేసెను ఇందుకు చారిత్ర కాధారములు కనిపించుచున్నవి

శకసంవత్సరము 1244 = క్రీ శ 1322 నాటి తాళ్ళ ప్రొద్దుటూరు శాసనమును జగిదాం గుత్తి రాజగు గంగదేవచోడ మహారాజు వేయించెను అందతనికి గంగయసాహిణి సర్వస్వబందికాఱ బిరుదమున్నట్లు తెలువబడినది కాని ఈ శాసనము గంగయసాహిణి యనంతర మరువదినాల్గు సంవత్స రములకు వేయబడినది గంగదేవచోడ మహారాజుకీ బిరుదము కులక్రమానుగతముగ వచ్చినట్టిది అతని తండ్రి అల్లు గంగరాజు కలుకడ పురాధీశ్వరులైన వైదుంబ స్వామిదేవ కేశవ దేవులకు స్నేహితుడు అంబదేవ మహారాజు శత్రువర్గములోనివాడు గంగదేవ మహారాజు పూర్వీకులు కాయస్థ ప్రభువులకు బద్ధవైరులు

అల్లుగంగరాజు, రక్కసగంగరాయదేవ మహారాజు సఖ్యముగా నుండి కాయస్థ గంగయ సాహిణితో పోరసల్పి, అతని సర్వస్వమును హరించి యుందురు కావున వంశానుగతముగ వచ్చిన గంగయసాహిణి సర్వస్వబందికార బిరుదమును గంగదేవచోడ మహారాజు వహించియుండును

నెల్లూరు పాలకుడు రెండవ మనుమసిద్ధి మంత్రి తిక్కన సోమయాజి అతడు నిర్వచ నోత్తర రామాయణమున గంగయసాహిణికి అల్లుగంగ, రక్కసగంగులతో సంభవించిన మోటమిని గూర్చి తెలిపెను

రంగదుదారకీర్తియగు రక్కసగంగన బెంజలంబుమై
భంగ మొనర్చి మన్మజనపాలుడు బల్విడి నాచికొన్నరా
జ్యాంగములెల్ల నిచ్చి దన యాశ్రితవత్సల వృత్తియేర్పడన్
గంగయ సాహిణిం బదము గైకొన బంచె బరాక్రమోన్నతిన్

రెండవ మనుమసిద్ధి గంగయసాహిణి కాశ్రయమొసంగి యాతని పక్షమున రక్కసగంగ నితో యుద్ధమొనర్చి, యోడించి, బలవంతముగ నతని రాజ్యాంగములను హరించి గంగయసాహిణి కొసంగి అతని నధికారమందు నిలిపెను

గంగయసాహిణి కాకతి గణపతిదేవుని సామంతుడు అతడు రాజ్యభ్రష్టుడైనందులకు, చింతించి, రెండవ మనుసిద్ధిని గంగయసాహిణికి సహాయమొనర్చుమని యాదేశించియుండును తనకు కాకతి ప్రభు వొనర్చిన సహాయమునకు ప్రతిఫలముగా రెండవ మనుమసిద్ధి గంగయసాహిణికి సహకరించి గణపతిదేవునికి సంతసము చేకూర్చెను

గంగయసాహిణి కాకతిప్రభువు మన్ననలకు పాత్రుడైనవాడు మనుమసిద్ధి తండ్రి తిరుకాళత్తిదేవ మహారాజు శక సంవత్సరము 1169 = క్రీ శ 1247 లో మరణించెను రెండవ మనుమసిద్ధి బంధువులు, దాయాదులు అతనిని పదవీచ్యుతుని గావింపదలచిరి కంచిలో అల్లున్ తిక్కరాజు స్వతంత్రుడై నెల్లూరు రాజ్యభాగముల నాక్రమించెను విజయగండ గోపాలుడు కొంత భూభాగము నాక్రమించి పాలింపదొడగెను తిక్కన బయ్యనలు తిరుగుబాటు చేసి నెల్లూరు నాక్రమించిరి

రెండవ మనుమసిద్ధి రాజ్యభ్రష్టుడై తనకు గల పరిమిత సైన్యముతో పోయిన రాజ్యమును సాధింపలేక కాకతి గణపతిదేవ చక్రవర్తి సహాయమును కోరదలచి తన మంత్రియు, మహాకవియు నగు తిక్కన సోమయాజిని ఓరుగల్లున కంపెను

తిక్కన సోమయాజి గణపతిదేవుని సహాయ మర్థించి తన యేలికయగు మనుమసిద్ధికి రాజ్యము సంప్రాప్తమగునట్లు చేయబూనెను గణపతిదేవుడు మనుమసిద్ధి తండ్రియగు తిక్కరాజు కాప్తవర్గములోనివాడు స్నేహితుని తనయు డాపదలో నుండి తన నర్థించుటవలన, సైన్యమును సమాయత్తపరచి నెల్లూరుపైకి పంపెను కాకతి సైన్యము తిక్కన బయ్యనలను యుద్ధరంగమునం దోడించి, నెల్లూరును వశపరచుకొని రెండవ మనుమసిద్ధి కప్పగించెను ఈ విషయము కాసె సర్వప్ప విరచిత సిద్ధేశ్వర చరిత్ర యను ద్విపదకావ్యమున పొందుపరచబడినది

ఈ సిద్ధేశ్వర చరిత్రమును కూచిమంచి జగ్గకవి, సోమదేవ రాజీయమను పేర పద్యకావ్యముగ రచించెను తనకు ఆపత్కాలమున సహాయ మందించిన కాకతి గణపతి దేవునికి సహకరించు ఉద్దేశ్యమున తనకు సహాయపడుమని అభ్యర్థించిన కాకతి గణపతి సామంతుడగు కాయస్థ గంగయసాహిణికి రెండవ మనుమసిద్ధి సైన్య సహాయమందించి, రక్కస గంగని యోడించుటలో తోడ్పడెను గంగయసాహిణి మనుమసిద్ధి సహాయమున రక్కస గంగని పారద్రోలి తన రాజ్యమును తిరిగి సంపాదించుకొనెను

రక్కస గంగరాయదేవ మహారాజు నెల్లూరు చోడులకు శత్రు వర్గములోనివాడు నెల్లూరు చోడరాజ్యమందున్న పొత్తపినాడును రక్కసగంగ డాక్రమించుటవలన మనుమసిద్ధి అతని యెడ

వైరభావము వహించి యుండెను రాయచోటి జ్యోతి శిలాశాసనములు రక్కసగంగని రాజ్యావధులను తెలుపుచున్నవి

మనుమసిద్ధి కాయస్థ గంగయసాహిణికి యుద్ధమందు తోడ్పడి రెండు విధముల లాభమును పొందెను

రక్కసగంగనిపై పగదీర్చుకొనుట, కాకతి గణపతి చేసిన ఉపకారమునకు, గంగయ సాహిణికి సహకరించి ప్రత్యుపకార మొనర్చుట అను నీ రెండు కార్యములు నిర్వహించుటవలన మనుమసిద్ధి కీర్తి ప్రతిష్ఠ లినుమడించెను

సారంగు నాయకుడు గంగయసాహిణి మంత్రి అతడు రాజంపేట తాలూకాలోని నందలూరులో శకసంవత్సరము 1172 = క్రి శ 1250 లో నొక శాసనమును వేయించెను అప్పటికే గంగయసాహిణి రక్కసగంగని యోడించి నందలూరువరకు వ్యాప్తమైయున్న పొత్తపి నాటిని తన యేలుబడిలోనికి దెచ్చుకొని యుండెనని భావింపవచ్చును

శకసంవత్సరము 1176 = క్రి శ 1254 నాటి గంగయ సాహిణి మంత్రియైన నామదేవ పండితుని త్రిపురాంతక శాసనమున గంగయసాహిణి "రక్కసగంగని దిశావట్టని గావించినట్లు న్నది అప్పటికి రక్కస గంగనితో జరిగిన యుద్ధము పరిసమాప్తమై, గంగయ సాహిణి మార్జవాడిలో స్థిరపడినట్లు భావింపవచ్చును ఈ యుద్ధానంతరము కొంతకాలమునకు రక్కస గంగరాయదేవ మహారాజు దివంగతుడై యుండవచ్చును

కేశవదేవ, సోమిదేవులను కాయస్థ అంబదేవ మహారాజు జయించినట్లు త్రిపురాంతక శాసనమందున్నది [1]

అంబదేవునికి పూర్వము కాయస్థ రాజ్యము నేలిన జన్నిగదేవ, త్రిపురాంతక దేవులు రక్కస గంగరాయదేవ మహారాజు మరణానంతరము వైదుంబ రాజ్యపాలకులతో యుద్ధములు చేయవలసి వచ్చినది ఈ పరిణామములు అంబదేవుడు రాజ్యాధిపత్యము వహించువరకు సాగినవి

రక్కస గంగని తరువాత త్రైలోక్యమల్ల భుజబలవీరనారాయణ నిశ్శంక ప్రతాప బిరుదాంచితుడగు శ్రీమన్మహా మండలేశ్వర సోమిదేవ మహారాజు కలుకడ రాజ్య సింహాసన మధిష్ఠించెను ఇతని పాలనా కాలమున, సిద్ధవటము తాలూకాలోని మాచువల్లి గ్రామమున శకసంవత్సరము 1178 =

1 త్రిపురాంతక దేవాలయ శాసనములు శా నెం 72

క్రీ శ 1256 రాక్షస కర్కాటక శుద్ధ 15 మంగళవారము నాడొక శాసనము వేయింపబడినది ఇందు మండలిక బ్రహ్మరాక్షస గండపెండార గంగయసాహిణి సోమిదేవరాజునుండి, శ్రీశైల దక్షిణద్వార సమీపమందున్న మాసూరువల్లి గ్రామమును గ్రహించి మలయ మండలవాసియగు కాలడి వాసుదేవ విప్రునకు దానమిచ్చినట్లున్నది [1]

గంగయసాహిణి రాజధానియగు వల్లూరు నుండి ములికినాటి నేలుచుండెను వల్లూరు మొదట వైదుంబుల రాజధానిగా నుండెను క్రీ శ 1256 నాటికి వైదుంబుల పాలన మంతరించలేదు సిద్ధవట ప్రాంత పాలకుడు సోమిదేవ రాజు అతడు రక్కసగంగని తరువాత సింహాసన మధిష్టించి గంగయసాహిణి సామంతునిగా నుండెను తన సామంతుడు పాలించు సీమలోని మాసూరువల్లి గ్రామము నాతని నుండి పొంది గంగయసాహిణి దానమిచ్చెను

గంగయసాహిణి శాసన మొకటి కమలాపురము తాలూకాలోని పొతదుర్తి గ్రామమున శకసంవత్సరము 1178 = క్రీ శ 1256 జ్యేష్ఠ శుద్ధ తదియనాడు వేయింపబడినది పూర్వదత్తమైన పొద తొర్లి గ్రామమును పునరుద్ధరించుచు ఈ శాసనము వేయింపబడినది

కడప తాలూకా అట్లూరు గ్రామమందున్న శాసనము శకసంవత్సరము 1196 నాటిది అందు కాకతి పురవరాధీశ్వరుడగు గంగయసాహిణి పుష్పగిరి దేవాలయ సిబ్బందికి దానమిచ్చినట్లున్నది ఈ శాసనము పింగళ సంవత్సరమున వేయింపబడినది పింగళ సంవత్సరము శకసంవత్సరము 1176 లో వచ్చును కాయస్థ గంగయసాహిణి కాకతి పురనాధుడు కాడు కాకతి పురవరాధీశుని సామంతుడు ఇచట కాకతి గణపతికి సంబంధించిన మరికొన్ని శాసనములున్నవి

కమలాపురము తాలూకాలోని గంగవరగ్రామ శాసనము శకసంవత్సరము 1179 పింగళ ఆషాఢ శుద్ధ 15 గురువారము నాటిది క్రీ శ 1257లో గణపతిదేవుడు రాజ్యమేలుచుండ, గంగయ సాహిణి, అతని అర్ధాంగి కమలాబాయి ములికినాటిలోని గంగవరము గ్రామమును పుష్పగిరిలోని పుష్పేశ్వర మహాదేవుని పూజాదుల నిర్వహణమునకు దానమిచ్చిరి ఈ దానము ఈశాన గురుదేవున కివ్వబడినది [2]

ములికినాడు, మార్జవాడిలోని కొన్ని ప్రాంతములు శకసంవత్సరము 1176 నుండి 1178 వరకు కాయస్థ గంగయసాహిణి యధీనమందుండెను ఈ కాలమున వైదుంబరాజు లితని సామంతులు

---

1 E I Vol XXVI Page 120

2 Inscriptions of A P Cuddapah District Part I No 141 Page 207

వ్యవహరించిరి కాకతి గణపతిదేవుని మహాసామంతునిగ గంగయసాహిణి యుగడెను[1] గంగయసాహిణి పాలనము శకసంవత్సరము 1180 = క్రీ శ 1258తో అంతమైనది అటుపిమ్మట అతని పెద్ద మేనల్లుడు జన్నిగదేవ మహారాజు కాయస్థరాజ్యపీఠ మలంకరించెను

జన్నిగదేవ, త్రిపురాంతక దేవులు తమ మేనమామ యగు గంగయసాహిణికి కుడి ఎడమ భుజములవలె నుండిరి [1] జన్నిగదేవుడు కాయస్థ సేనలకు నాయకత్వము వహించి, రక్కసగంగని ఓడించెను ఈ యుద్ధమున గంగయసాహిణి అమాత్యు లన్ని విధముల సహాయ సహకారము లందించిరి గంగయసాహిణి మంత్రి సారంగు నాయకుడు శకసంవత్సరము 1172 సాధారణ = క్రీ శ 1250 లో కడపజిల్లా నందలూరు సౌమ్యనాథస్వామ్యాలయమునందున్న శాసనమున పేర్కొనబడినాడు [2]

గంగాయసాహిణి అమాత్యులలో వాయిదేవ పండితుడు, అతని తనయుడు నామదేవ పండితుడు ముఖ్యులు వీరు కాయస్థ వంశజులు వాయి పండితుని సతి గంగాబాయి ఈ దంపతుల కుదయించినవాడు నామదేవపండితుడు అసాధారణ ప్రజ్ఞావంతుడు అతడు త్రిపురాంతక శాసనమున[3] 'గండపెండారు గంగయసాహిణి సమస్త రాజ్యసముద్ధరుండైన స్వస్తి సమస్త రాజ్యభార నిరూపిత మహామాత్య పదవీ విరాజ్యమానమానోన్నత ప్రభుమంత్రోత్సాహ శక్తిత్రయగుణ సంపన్న అనయాసన ద్వైధీభావషాడ్గుణ్యగుణోపేత పరేంగిత జ్ఞాన అష్టావధారణౌదార్య భరిత ఉత్పన్నమతి సంపన్న సురగురు సమాన సకళ శాస్త్ర పారావారక మంత్రి మాణిక్య నీతిచాణక్య పతికార్యధురంధర పరివార కల్పలత పూజ్య దీనార్తిజన సువర్ణ ధారా నటసిగభీర - దీనా నాంధ గాయక వైతాళిక వైఖానిక దండి ముండి ఖండి నానాపేక్ష షోడశ యాచకదరిద్రఖండన నిత్యనేమస్థాన వాసిష్ఠ పురోగమనులైన నామదేవ పండితులని ' వర్ణింపబడినాడు

నామదేవ పండితుడు పలనాటి సీమలోని దుర్గి పట్టణమున తన తండ్రిపేర ఓంకేశ్వరాలయమును నిర్మించి శకసంవత్సరము 1173 = క్రీ శ 1251 ఆనంద వత్సరమునం దొక శాసనమును వేయించెను

ఆ శాసనమున "గంగయసాహిణి సకల రాజ్య సముద్ధరుండును శ్రీ కరణాధిపతియునుం గాయస్థకుల వార్ధివర్ధన సుధాకరుండునునైన నామదేవ పండితులు పల్లినాంటిలోని దుగ్యపట్టణమునందు తమ తండ్రి వాయిపండితుల పేరను వంకేశ్వర దేవరం బ్రతిష్టసేసి గణపతిదేవ మహారాజులనుగానిచి,

1 S I I Vol VI No 599
2 A R No 595 of 1907
3 త్రిపురాంతక దేవాలయ శాసనములు శా నెం 41 పుటలు 93-94

కారుణ్యము వడసి మూరురాయ జగదళవడగాను చలమెత్తుగండ బిరుదూం దెచ్చి సకల సన్నాహము మెఱసి ఎదురువచ్చి, కానిఎంచుకొని పడగా బిరుదూ నిచ్చినం జేకొని సంతోషించియున్న యవసరంబున దేవర కారుణ్యమున దుగ్యను వంకేశ్వరదేవర ప్రతిష్ఠ సేస్తినని విన్నవము సేసినను ఆ దేవరకు నమస్కరించి, వంకేశ్వర దేవర కంగరంగ భోగ నైవేద్యములకుం గృష్ణవేణి సమీపంబున నాగార్జుని కోట తూవ్పూలం నెయ్యూరి సహితముగానిచ్చె[1] అని యున్నది

గంగయసాహిణి శైవుడు అతని దానములన్నియు శివాలయములకే చెందినవి అతని ఇష్ట దైవము త్రిపురాంతక మహాదేవుడు గంగయసాహిణి శకసంవత్సరము 1172 = క్రీ శ 1250 లో త్రిపురాంతకములోని మూలస్థాన దేవర అంగరంగ భోగములకు, దువలి కంవనములోని బోయపల్లె రెడ్లపల్లె పొలము చతుస్సీమము సకలాయ సహితముగాను [2] శకసంవత్సరము 1177 రాక్షస = క్రీ శ 1255 లో త్రిపురాంతక మహాదేవునికి సంధ్య అంగరంగ భోగములకు దానమిచ్చుచు శాసనములు[3] వేయించెను

గంగయ సాహిణి ధర్మపత్ని కమలాబాయి శివభక్తి కలది పుష్పగిరి క్షేత్రమనిన అభిమానమున్నట్టిది

అల్లుగి తనయ హాచలాంబ, ఖండేరాయ పల్లవ రాజులతో కలిసి కమలాబాయి పుష్పగిరిలో నొక త్రికూటేశ్వరాలయమును నిర్మించెను ఆమె తన పేర కామలేశ్వరుని ప్రతిష్ఠించెను హాచలేశ్వరుని హాచలాంబ పల్లవేశ్వరుని పల్లవ ఖండేరాయ ప్రతిష్ఠించిరి [4]

కమలాబాయి భర్తయగు గంగసాహిణితో కలిసి శకసంవత్సరము 1179 పింగళి = క్రీ శ 1257లో కమలాపురము తాలూకాలోని గంగవరము గ్రామమును పుష్పేశ్వర మహాదేవుని పూజాపురస్కారములకు దానమిచ్చుచు శాసనము వేయించెను [5]

గంగయసాహిణి శాసనములందు 'చాతుర్వర్ణ సముద్ధరణ' అని చెప్పబడినాడు [6] ఆలుమగ లిరువురు శివపూజాధురంధరులు అనేక దేవాలయములు నిర్మించి వాటి నిర్వహణమున కగ్రహారముల నొసంగినారు

---

1 S I I Vol X No 384 Pages 171 174

2 త్రిపురాంతక దేవాలయ శాసనములు శా నెం 33 పుటలు 83-84

3 త్రిపురాంతక దేవాలయ శాసనములు శా నెం 43 పుటలు 96

4 Inscriptions of A P Cuddapah District Part I

5 Inscriptions of A P Cuddapah District Part I

6 A R No 283 of 1905

గంగయసాహిణికి గల బిరుదములు ఆతని తరువాత కాయస్థ రాజ్యమునేలిన జన్నిగదేవ, త్రిపురాంతక, అంబదేవ, త్రిపురారిదేవులు వహించినారు

మహారాష్ట్రము నుండి బంధుమిత్ర పరివార సమేతముగా నాంధ్రదేశమునకు వచ్చి చిన్న రాజ్యమును స్థాపించుకొని కాకతి గణపతిదేవుని మన్ననలు పొంది పానుగల్లు నుండి మార్జవాడి వరకు గల విశాల సామ్రాజ్యమున కధిపతియై అనేక యుద్ధములందు విజయములు సాధించిన గంగియసాహిణి శివపూజా తత్పరుడు గొప్ప యోధుడు శివాలయములను నిర్మించి తమ భక్తి ప్రపత్తులను ప్రకటించి తమ కీర్తి శాశ్వతముగ నిలుచునట్లు చేసిన గంగయసాహిణి దంపతు లాదర్శప్రాయులు

**జన్నిగదేవుడు** - అంబమ్మాపతి చందూబాయి దంపతుల జ్యేష్ఠ పుత్రుడు జన్నిగదేవుడు గంగయసాహిణి పెద్ద మేనల్లుడు ఇతడు కాయస్థ రాజ్యసింహాసనమును గంగయసాహిణి మరణానంతరము శకసంవత్సరము 1180 = క్రీ శ 1258లో అధిష్ఠించి 12 సంవత్సరములు అనగా శ సం 1191 = క్రీ శ 1269 వరకు పాలించెను

పానుగల్లు నుండి మార్జవాడి వరకు గల విశాల సామ్రాజ్యము నితడు పాలించినట్లు శాసనములు నుడువుచున్నవి కాకతి గణపతి అవసానదశయం దాతనికి మంత్రిగా నుండి సమస్త సామ్రాజ్య భారము వహించి, రాచకార్యముల నతి సమర్థవంతముగ నితడు నిర్వహించెను

జన్నిగదేవుడు గొప్ప వీరుడు గంగయసాహిణికి -మావనంకకార'గా అనగా మామయగు గంగయసాహిణి ఖడ్గకార్యమును నెరవేర్చు యోధునిగ ప్రశంసింపబడెను

కాకతి అశ్వసైన్యాధిపతిగా అనేక యుద్ధములందు పాల్గొని విజయములు సాధించెను పశ్చిమరాయ దామోదర దిశాపట్ట రక్కసగంగ బెంకొండుగండ, ఒడ్డియరాయ అభిమాన చూరకారాది బిరుదములు వహించెను ఇతనిచే పరాజితుడైన ఓఢ్రరాజు గాంగవంశజుడైన మొదటి నరసింహదేవుడు కాకతి సేనలకు ఒడ్డెరాజులతో సంభవించిన యుద్ధమున నెల్లూరు రెండవ మనుమసిద్ధి పాల్గొనెను కాకతి గణపతిదేవ చక్రవర్తి అభిమానమును పొంది కాకతి సేనల విజయమునకై గౌతమీ తీరమున యుద్ధమొనర్చెను ఈ విషయమును శకసంవత్సరము 1181 = 1259 నాటి కడపజిల్లా నందలూరు సౌమ్యనాధస్వామి ఆలయ శాసనము ధృవపరచుచున్నది ఈ శాసనము వీరరాజేంద్ర చోళుని 13వ రాజ్యసంవత్సరమున వేయింపబడినది [1]

---

1 A R No 580 of 1907

కాకతి గణపతి పట్టసాహిణి వదిరము బొప్పేశ్వరుడు అతడు "సాంపరాయ సందర్శిత రిపుకవందతాండవ గోదావరి తీర సమర గాండీవుడ ని తెలుపబడినాడు [1]

ఈ గోదావరీతీర సమరమున కాయస్థ జన్నిగదేవుడు పాల్గొని ఒడ్డెరాయనితో పోరి అతని మానమును చూరగొనియుండును పల్లవ బ్రహ్మరాక్షస సిద్ధయదేవుడు జన్నిగదేవుని కరివర్గములోని వాడు శకసంవత్సరము 1181 సిద్ధార్థి క్రీ శ 1259 నాటి కడపజిల్లా మైదుకూరు శాసనము కొంత సమాచారము నిచ్చుచున్నది గణపతిదేవ మహారాజు పాలించు కాలమున కందీపురాధిప కామ కోట్యంబికా ప్రసాద లబ్ధ విభవ భారద్వాజగోత్ర పవిత్రులయిన కదంబరాయ భీమదేవ మహారాజు తనయు డగు బ్రహ్మరాక్షస సిద్ధయదేవచోడ మహారాజులు చతురంగ బలముతో దండెత్తి పినాకినీ తీరమందున్న సోమశిల చెంత విడిసియుండెను ఆ విషయము నెఱింగి కాయస్థ జన్నిగదేవమహారాజు సమస్త సైన్యమును సమకూర్చుకొని సోమశిలకేగి అతని నెదిరించి యుద్ధరంగమం దతనిని సంహరించినట్లును శకసంవత్సరము 1183దుర్మతి = క్రీ శ 1261 మాఘ బహుళ 11 దినమున జన్నిగదేవుడు జయ స్తంభమును నాటించి, దేవాలయమును నిర్మించి ఆలయ పూజాదికములకు వృత్తుల నేర్పరచినట్లు గండి కోట కైఫియతు తెలుపుచున్నది

కాకతి గణపతిదేవ మహారాజు చివరిదినములందు పాండ్యప్రభువులు చోళ రాజ్యసీమల నాక్రమించిరి శకసంవత్సరము 1184 = క్రీ శ 1262లో జటావర్మ సుందరపాండ్యుడు నెల్లూరుపై దండెత్తెను రెండవ మనుమసిద్ధికి సహాయముగా కాకతి గణపతి కొంత సైన్యమును పంపించెను

ముత్తుకూరు చెంత పాండ్య, కాకతి, చోళసైన్యములు తలపడినవి సంకులసమర మేర్పడినది కాకతి చోళసైన్యములు పాండ్య సైన్యము దాటి కాకజాలక యుద్ధరంగము వీడినవి పాండ్యసైనికులు శత్రుసైనికులను వెన్నాడి కృష్ణానది వరకు తరిమివేసినట్లు పాండ్యరాజుల శాసనములు తెలుపుచున్నవి

ముత్తుకూరు సంగ్రామమున మనుమసిద్ధి మరణించెను [2] నెల్లూరు చోడరాజ్యము పాండ్యుల వశమయ్యెను జటావర్మ సుందర పాండ్యుడు నెల్లూరులో పట్టాభిషిక్తుడయ్యెను అతడు కడప జిల్లాలోని నందలూరు గ్రామమున ఈ విజయమును సూచించుచు శాసనమును వేయించెను [3]

---

1 A R No 194 of 1905

2 T T D I Vol No 19

3 A R No 613 of 1907

పాండ్యసేనయు ముందుకు సాగి కాకతి రాజ్యభాగముపై దండెత్తి ఆక్రమింపసాగెను పాండ్యరాజుల సామంతుడును మహావీరుడునునగు కొప్పెరుంజింగడు కాకతి రాజ్యభాగములను జయించుచు తూర్పుతీరమువరకు చేరెను అతనికి సంబంధించిన శాసనములు కడప మండలములోను, తూర్పు గోదావరి జిల్లాలోని ద్రాక్షారామములోను కనిపించుచున్నవి [1]

కాకతి గణపతిదేవున కీ అపజయము తలవంపైనది వృద్ధాప్యమున నున్నను, సేనానులను రావించి క్రొత్తసేనమును సమకూర్చి నెల్లూరుపై దండయాత్ర నిర్వహించుట కాజ్ఞాపించెను కాకతి సేనలు సమధికోత్సాహమున ముందుకు సాగి పాండ్య సేనలను, కొప్పెరుంజింగని సైన్యమును ఎదుర్కొని పోరాడి విజయము సాధించెను కొప్పెరుంజింగ డోడిపోయి కాకతి గణపతిదేవుని సామంతునిగా నుండ నంగీకరించెను

జన్నిగదేవ మహారాజు కాకతి సేనల కాధిపత్యము వహించి నెల్లూరు ముట్టడిలో విజయము సాధించెను ఈ విషయమును ధృవపరచు శాసన మొకటి కడప జిల్లా రాజంపేట తాలూకా నందలూరులో కనిపించుచున్నది జన్నిగదేవ మహారాజు కొప్పెరుంజింగని నోడించుటలో ప్రధానపాత్ర వహించెను కాకతి గణపతిదేవుడు సమస్త రాజ్యభారమును తన కుమార్తె రుద్రమదేవిపై మోపెను కాకతి రుద్రమ కన్ని విధముల అండగా నిలిచి జన్నిగదేవ మహారాజు యుద్ధములం దఖండ విజయమును చేకూర్చెను

జన్నిగదేవ మహారాజు సర్వాధికారి, మెయిదేవరాజు శకవర్షము 1186 రక్తాక్షి మాఘ శుద్ధ 15 గురువారము నాటి సోమ గ్రహణ నిమిత్తమున శ్రీ సూరేశ్వర దేవర అంగరంగ భోగమునకు దానమిచ్చు సందర్భమున కారెంపూడిలో నొక శాసనమును వేయించెను ఇందు జన్నిగదేవుడు గణపతి దేవ దక్షిణ భుజాదండ, అని వర్ణింపబడినాడు కాయస్థ రాజుల ప్రశస్తి ఇతనికి చేర్చబడినది

ఈ శాసనమున జన్నిగదేవ మహారాజు "అనేక నామావళి విరాజమాన మానోంనత అతి విషమహయారూఢ ప్రౌఢరేఖా రేవంత విజయలక్ష్మీ కాంత దశదిగ్భరిత కీర్తి కామినీవల్లభ భయలోభ దుర్లభ పశ్చిమ రాయ దామోదర శైంన్య దిశాపట్ట, వైరిఘరట్ట మూఱురాయజగద్దాళ రిపుబల కోళాహళ రక్కసగంగ బెంకొండు గండ చలమెత్తుగండ గణపతిదేవ దక్షిణ భుజాదండ జగమెచ్చు గండ సత్యహరిశ్చంద్ర విభవామరేంద్ర అరిబిరుద మండళిక మస్తక శూల విజయలక్ష్మీలోల యొద్దు రాయ అభిమానచూఱకాఱ మావనంక కాఱ సరణాగత వజ్రపంజర పరనారీ సహోదర పతిహితచరణ అనవరత వితరణ శ్రీ మనుమహామండ్లేశ్వరం ఘోళెరాయ బ్రహ్మరాక్షస గండపెండ్గార కువర

1 S I I Vol IV No 1341

మురారి నాయంక్క నారాయణ జన్నిగదేవ మహారాజులు పానుగల్లాదిగ గైవారము కోటదాంకా ననేక దేశంబు లేలుచుం సుఖసంకథా వినోదంబులం బ్రిధివి రాజ్యం సేయ్యం అని వర్ణింపబడినాడు

ఈ శాసనమును వేయించిన మెయిదేవరాజు కాయస్థ వంశీయుడు గండపెండార బిరుదాంచితుడు

జన్నిగదేవ మహారాజు పుష్పగిరిలో నొక శాసనమును వేయించెను [1] అందతడు సిద్ధార్థి సంవత్సర వైశాఖమాస అక్షతదియనాడు గిరివల తిరిగివచ్చి ఇంద్రేశ్వర దేవరకు తురుబిడ్లపాడు గ్రామము నంగరంగ భోగములకై దానమిచ్చినట్లున్నది

శకసంవత్సరము 1181 సాధారణ కార్తీక బహుళ అమావాస్య గురువారమునాడు జన్నిగ దెవుడు త్రిపురాంతకమున త్రిపురాంతకేశ్వరుని అంగరంగ భోగములకు పలనాటి సీమలోని గంద్రకోట అనుంగురాజుపల్లి చతుస్సీమమును ధారవోసి యిచ్చు సందర్భమునం దొక శాసనమును వేయించెను

జన్నిగదేవుడు కడపజిల్లా బద్వేల్ తాలూకా ఇటిగుల్లపాడులో సకలిసీమ గ్రామమగు ముడమలను శైవగురువును, శ్రీశైల మందున్న అభినవ గోళకీమఠాధిపతియునగు శాంతశివదేశికులకు, శివలింగ మఠము, విద్యాపీఠములను నిర్వహించుటకు, అతిథులకు భోజనాది వసతులేర్పరచుటకు దానమిచ్చుచు శాసనమును వేయించెను

కడపజిల్లా రాజంపేట తాలూకాలోని పొందలూరు గ్రామమందున్న కైలాసనాథాలయమున గల రాతి స్తంభముపై శక సంవత్సరము 1182 రౌద్రి చైత్ర శుద్ధ గురువారము మేష సంక్రమణ కాలమున జన్నిగదేవ మహారాజు, అధి రాజ చోళ మండలము పాకనాడు పరిధి పొత్తపినాటిలోని పురుందలూరు గ్రామమును శ్రీ పర్వత మందలి అభినవ గోళకీ మఠాధిపతియు గురువుననగు శాంతశివ దేశికులకు విద్యామంటప నిర్వహణార్థము, శివలింగ మఠమునకు వచ్చు అతిథుల భోజన వసతికి దానమిచ్చు సందర్భమున శాసనమును వేయించెను

శక సంవత్సరము 1190 విభవ = క్రి శ 1268 లో అట్లూరి శాసనము వేయింపబడినది ఇందు కాకతి రుద్రమదేవి కాయస్థ జన్నిగదేవ మహారాజు పేర్కొనబడినాడు

కరణము నామయ శకసంవత్సరము 1191 శుక్ల జ్యేష్ఠ శుద్ధ 10 సోమవారము = క్రి శ 1269 దుర్గి పట్టణమున గోపీనాథ దేవర ప్రతిష్ఠగావించి దేవర అంగరంగ భోగములకు వృత్తి క్షేత్రములు

1 ఆం ప్ర ప్ర కడప జిల్లా శాసనములు

బెట్టు సందర్భమునందు శాసనమును వేయించెను శాసనమున కాకతి గణపతి పట్టోద్ధతియైన రుద్రమహాదేవి ఓరుగల్లు రాజధానిగా పాలించుచున్నట్లును, ఆమె పాదపద్మోపజీవి మండలిక బ్రహ్మరాక్షస గండపెండార జన్నిగదేవరాజు పానుంగల్లు మొదలుగాను మార్జవాడిందాక ఏలి సుఖ లీలను రాజ్యము చేయుచుండగా అని తెలుపబడినది

శాసన మొసంగిన కరణము నామయ బ్రహ్మకులోత్తముడు కాస్యప గోత్ర పవిత్రుడు సవదర మల్లపరాజు తనయుడు శకసంవత్సరము 1184 = క్రీ శ 1262 నాటికి గపతిదేవ చక్రవర్తి తన కుమార్తె రుద్రమదేవికి రాజ్యమప్పగించెను జన్నిగదేవుడు కాకతి రుద్రమకు విశ్వాస పాత్రుడై కాకతి సేనలకు నాయకత్వము వహించి అనేక యుద్ధములందు పాల్గొని విజయములు సాధించెను

పలనాటిలోని తాళ్ళపల్లిలో శకసంవత్సరము 1189లో నొక శాసనము వేయింపబడినది [1] అందు కాయస్థ జన్నిగదేవ మహారాజు రుద్రదేవ మహారాజు సామంతుడై యున్నట్లు తెలుపబడినది

కడప జిల్లా సిద్ధవటము తాలూకాలోని అట్లూరు శాసనము 1190 శక సంవత్సరము నాటిది [2] అందు కాయస్థ బిరుదమున్న రాజు రుద్రదేవ మహారాజు సామంతునిగా వర్ణింపబడినాడు అతడు జన్నిగదేవ మహారాజే

జన్నిగదేవుని మంత్రులలో ముగ్వురు పేర్కొనదగినవారు 1 మహాప్రధాని అనంత దేవుడు, 2 గండపెండారు మెయిదేవుడు, 3 తాళ్ళపల్లి దేవరాజు

మహాప్రధాని అనంతదేవుడు సర్వాధికారి శకసంవత్సరము 1181 కాళయుక్తి = క్రీ శ 1259 నాటి కర్నూలుజిల్లా గిద్దలూరు తాలూకాలోని తురిమెళ్ళ ముక్కంటీశ్వర దేవునికి జన్నిగదేవుని సుకృతార్థము శాసనమును వేయించెను [3]

రెండవ మంత్రి గండపెండారు మెయిదేవుడు సర్వాధికారి పదవిలోనున్నవాడు అతడు గుంటూరు జిల్లా పలనాడు తాలూకాలోని కారెంపూడి సూరేశ్వర దేవర అంగరంగ భోగములకు శక సంవత్సరము 1186 = క్రీ శ 1264లో భూమి దానమొసంగుచు శాసనమును వేయించెను [4]

---

1 A R No 324 of 1930 31

2 A R No 1 of 1939 40

3 A R No 274 of 1949-50

4 A R No 550 of 1909

మూడవ మంత్రి తాళ్ళపల్లి దేవరాజు శకసంవత్సరము 1189 = క్రీ శ 1267లో గుంటూరు జిల్లా పలనాటిసీమలోని తాళ్ళపల్లి గ్రామమున లక్ష్మీనారాయణస్వామిని ప్రతిష్ఠించి పూజాదికములకు కొంత భూమిని అంబసముద్ర గ్రామసుంకమును దానమిచ్చుచు శాసనము వేయించెను [1]

జన్నిగదేవ మహారాజు గంగయసాహిణి యనంతరము కాయస్థ రాజ్య సింహాసన మధిష్ఠించి కాకతి రాజన్యులకు విధేయ సామంతుడై యుండెను అతడు శివపూజాధురంధరుడు అరివీర భయంకరుడు కాకతి రుద్రమదేవి సింహాసన మధిష్ఠించిన పిదప కొందరు సామంతులు తిరుగుబాటొనర్చిరి కొందరు స్వతంత్రులైరి దేవగిరి యాదవ రాజులు, పాండ్యులు కాకతి రాజ్యాభివృద్ధిని చూచి సహింపలేకుండిరి సామ్రాజ్యమునం దలజడులు సృష్టించిరి జన్నిగదేవుడీ విపత్కర సమయమున కాకతి రుద్రదేవ మహారాజుకు బాసటగా నిలిచి, సామంతుల నణచి, శత్రు రాజులు దండయాత్రల నరికట్టెను జన్నిగదేవుడు క్రీ శ 1258 నుండి 1270 వరకు కాయస్థ రాజ్యము నతి వైభవముతో పాలించెను

**త్రిపురాంతకుడు** - జన్నిగదేవుని యనంతర మాతని సోదరుడు త్రిపురాంతకుడు శక సంవత్సరము 1192 = క్రీ శ 1270 లో కాయస్థ రాజ్యపీఠ మలంకరించెను త్రిపురాంతకునికి సంబంధించిన నాలుగు శాసనములు లభించినవి అందు రెండు శాసనములు నెల్లూరు జిల్లా దర్శి తాలూకాలోని పొట్లపాడు గ్రామములోని వీరభద్ర స్వామి ఆలయము ముందున్న శిలలపై చెక్కబడియున్నవి ఇందు త్రిపురాంతకుడు "కాకతి కులతిలక రుద్రదేవ మహారాజ చరణ నళిన యుగళ సమారాధక' అని వర్ణింపబడినాడు

ఈ శాసనములలో నొకటి శకసంవత్సరము 1151, రెండవది 1157 నాటివిగా ప్రకటింపబడినవి ఈ శకసంవత్సరములు తప్పుగా వ్రాయబడినవి ఇవి శకసంవత్సరము 1192 నాటివి అనగా క్రీ శ 1270 నాటివి శకసంవత్సరము 1151, 1157 ల నాటికి కాయస్థ గంగయసాహిణి ప్రవృద్ధుడై యుండలేదు

ఆలువలపాడు శాసనము శకసంవత్సరము 1194 ఆంగీరస శ్రావణ శుద్ధ పౌర్ణమి బుధవారము క్రీ శ 1272 నాటిది ఈ శాసనము[2] సోమగ్రహణ కాలమునం దీయబడినది త్రిపురాంతక దేవర అంగరంగ భోగములకు శ్రీమత్త్ర్యయంబక శివాచార్యులహస్తమందు పోలిగండ స్థలమందలి అలువలపాడు గ్రామమును సకలాయ సహితముగా ధారాపూర్వకముగ దానమిచ్చు సందర్భమునం దీయబడి‍ౕది

1 A R No 82 of 1933 31
2 A R No DI



చీకటిమిద్దె ఉత్తర కుడ్యము



చీకటిమిద్దె పశ్చిమ కుడ్యము



శివాలయము – ముఖమండపములోని నంది విగ్రహము

త్రిపురాంతకుడు శకసంవత్సరము 1194 అంగీరస ఆషాఢ శుద్ధ చతుర్దశి = క్రీ శ 1272న త్రిపురాంతక మహాదేవునికి భూషణములు సమర్పించు సందర్భమునందు శాసనమును వేయించెను [1]

దుర్గి శాసనములందు త్రిపురాంతకుడు శ్రీ కాకతి కులతిలక రుద్రదేవ మహారాజు చరణ విధేయుడననియు, కాకతి కులతిలక రుద్రదేవ మహారాజు చరణ నళినయుగళ సమారాధకుడననియు తెలుపుకొనినాడు

కడప జిల్లా బద్వేల్ తాలూకాలోని అక్కులరెడ్డిపల్లి గ్రామ సమీపమందున్న కొండపైనున్న మల్లికార్జునాలయము ముందున్న శిలా ఫలకముపై శకసంవత్సరము 1205 స్వభాను వైశాఖ శుద్ధ సప్తమీ సోమవారము = క్రీ శ 1283 ఏప్రియల్ 15 వ తేదీన గౌరేశ్వరబాయి మాండలిం బ్రహ్మరాక్షస, గండపెండార త్రిపురారిదేవ మహారాజులకు పుణ్యముగా శివాలయమును నిర్మించి వృత్తులను పెట్టు సందర్భమున శాసనమును వేయించెను త్రిపురాంతక దేవుని మరణానంతర మాతనికి పుణ్యమగునట్లు ఆలయమును నిర్మించుట జరిగినది గౌరేశ్వరబాయి త్రిపురాంతకుని ధర్మపత్ని కావచ్చును ఈ దాన రక్షణబాధ్యత వహించి ధర్మవు నడిపి పుణ్యము పొందుటకు సామంత నల్లైనారాయణస్వామి సాహణప గారు నియమింపబడినట్లు శాసనమందున్నది

త్రిపురాంతకుడు రుద్రమదేవికి విధేయ సామంతుడై కాకతి రాజ్య పశ్చిమ సీమలను రక్షించుచు కాయస్థ రాజ్యమును క్రీ శ 1270 నుండి 1272 వరకు పాలించెను

త్రిపురాంతకుడు శివభక్తుడు త్రిపురాంతక దేవుని పాదరాధకుడు శకసంవత్సరము 1194 = 1272 లో త్రిపురాంతక మహాదేవునికి 3 పట్టాలు గంగావతారము ఒకపెద్ద పూవు, ఒక ఒయారము, ఒక మినుంగు తోడినూలు, ఒక మాల్యపూవు రెండు వహిండి ఆకులు, రెండు గుంటకాలు సమర్పించుచు శాసనమును వేయించెను ఇతని పాలనము కొలది కాలమేయైనను, గంగయ సాహిణి, జన్నిగదేవుల కాలమునుండియు అనేక యుద్ధములందు పాల్గొని విజయసాధనలో తోడ్పడియుండెను

**అంబదేవుడు** - గంగయసాహిణి మూడవ మేనల్లు డంబదేవుడు అతని సోదరులు జన్నిగదేవ త్రిపురాంతకదేవులు అంబక్కావతి చందూబాయి దంపతుల తనయులలో అంబదేవుడు చివరివాడు త్రిపురాంతకుని యనంతరము అంబదేవుడు కాయస్థ రాజ్యపీఠ మలంకరించెను ఇతడు క్రీ శ 1272లో రాజై క్రీ శ 1302 వరకు సుమారు 30 సంవత్సరములు విశాలమైన కాయస్థ రాజ్యమును పాలించెను

---

1 త్రిపురాంతం దేవాలయ శాసనములు నెం 67 పుట 127

అంబదేవు డసహాయ శూరుడు అప్రతిమాన ప్రతిభావంతుడు రాజనీతిపరుడు యుద్ధ విశారదుడు ఆంధ్రదేశమునందున్న అనేక మాండలికులను, సామంతులను జయించి, కాకతి రాజ్య సీమల నాక్రమించి స్వతంత్ర కాయస్థ రాజ్యమును నెలకొల్పెను పాండ్య, యాదవ రాజులతో స్నేహ మొనర్చి అనేక సామంత మాండలికులను కలిగి కాకతీయులతో వైరము కలిగియుండెను

కాయస్థ వంశజులలో గంగసాహిణి, అంబష్మావతి, జన్నిగ, త్రిపురాంతకదేవులు కాకతి రాజులకు విధేయ సామంతులుగ నుండిరి కాని అంబదేవుడు కాకతీయుల నెదిర్చి, వారి శత్రువులతో సఖ్యము నెఱపెను

అంబదేవుని పరాక్రమము, విజయములు, శక్తిసంపద, అత డొనర్చిన ఘనకార్యములు శక సంవత్సరము 1212 = క్రీ శ 1290 నాటి త్రిపురాంతక శాసనమున వర్ణింపబడినవి [1] ఈ శాసన మందు అంబదేవుని వర్ణనము, ఆతని ఘన కార్యములు సంస్కృత భాషలో వర్ణింపబడినవి

1 శ్రీపతి గణపతిపై విజయము-రాయ సహస్రమల్ల బిరుదము పొందుట

2 పంచాధిక సప్తతిక్షితిపతి భృతుల ఖండిత శీర్షములతో తన కంటియం దుద్భవించిన రుషాదేవతను రణ క్షేత్రమున పూజించుట

3 ఏఱువమల్లి దేవుని వధించుట అతని శిరముతో కందుక క్రీడ సలుపుట

4 వంద్రెండుమంది మాండలికులను కలిగి వారు తనను కొలువ శత్రురాజ శిరోమాలను ధరించి భైరవ వేషధారియై యాదృచ్ఛికముగా ప్రజలచే స్తుతింపబడుట

5 సోమిదేవ, అల్లుగంగలతో కలిసి యున్న కేశవదేవు నోడించి తఱిమివేయుట

6 సెంతిసీమ పాలకుడును, పాపియు, ధర్మద్రోహియునగు మల్లికార్జునుని శస్త్రపూతమైన వధను త్యజించి అతని సప్తాంగములను హరించి పారద్రోలుట

7 బొల్లయ కుమారుడగు రాజన్నకు, తన కుమార్తె నిచ్చి వివాహ మొనర్చి నందాపుర రాజ్యము నరణముగా నిచ్చుట

8 ఆంధ్రరాజు లందరిని యుద్ధమున జయించుట

9 పదభ్రష్టుడైన మనుమగండ గోపాలుని నెల్లూరు సింహాసనమున ప్రతిష్ఠించుట

---

1 త్రిపురాంతక దేవాలయ శాసనములు శా నెం 72

10 గజము, అశ్వము వృషము, అమృతము, లక్ష్మి, కామధేనువు వంటి వానిని పొందుటకు అమరులు కడలినిఁద్రచ్చి కాల కూటముచే విహతులు కాగా, అంబదేవుడొక్కఁడే ఏకాంగవీరుడై శత్రుసైన్య విషనిధిని మథించి యశ్వీయహాస్తిక సంపదను, నశింపని కీర్తిని పంచ పాండ్య కల్ప వృక్షములను గొనెను

త్రిపురాంతక శాసన మతనికి అనేక బిరుదములున్నట్లు తెలుపుచున్నది 1 దామోదరదిశాపట్ట 2 ప్రత్యనీక ప్రాసాదాయ మానకుల శేఖరగండ 3 దేవగిరిరాయ ప్రస్థాపిత ప్రాభృతమణి కనక భూషణ 4 కాడవరాయ విధ్వంసన 5 అతి పాండవ పరాక్రమ పాండ్యరాజన్య ప్రియ ప్రేషిత చండవేతండ వైనతేయ జంఘాలతురంగ సార్థ విరాజమాన పోషిత సౌహార 6 రాయస్థాపనాచార్య

## దామోదర దిశాపట్ట -

అంబదేవుడు, గంగయసాహిణి, జన్నిగదేవుడు, త్రిపురాంతకుడు వహించిన దామోదర దిశాపట్ట పశ్చిమ రాయ దామోదర సైన్యదిశాపట్ట బిరుదములను గ్రహించెను ఇది కులక్రమాగతముగ నతనికి సంక్రమించిన బిరుదము

## శ్రీపతి గణపతిపై విజయము -

అంబదేవుని నీలగంగవర శాసనమున పేర్కొనబడినవాడు శ్రీపతి గణపతి [1] గుంటూరు జిల్లా పలనాడులోని గురిందాల లేక గురిజాల రాజ్యమునకు ప్రభువు

గురిందాల శాసనమొకటి శకసంవత్సరము 1190 విభవ = క్రీ శ 1268 నాటిది కలదు అందు శ్రీపతి గణపతి అనుచరుడు మారి నాయకుడు చెన్న కేశవ దేవరకు భూదాన మొసంగినట్లున్నది

అదే శాసన శిలపై రుద్రదేవమహారాజు పాలించు కాలమున వీరబలంజ సంఘమువారు రాజునకు పుణ్యమగునట్లు చెన్న కేశవస్వామికి, సరుకులపై వచ్చు వరుంబడిలో కొంత దానమిచ్చినట్లు చెక్కఁబడి యున్నది [2]

గురిజాల ప్రాంతము, కాకతిరుద్రమ, శ్రీపతి గణపతుల పాలనములో నుండెను శ్రీపతి గణపతి కాకతి రుద్రమదేవి సామంతుడు అంబదేవు డావహమున శ్రీపతి గణపతిని జయించెను అంబదేవుడు క్రీ శ 1268 నాటికే శ్రీపతి గణపతిని జయించియుండవచ్చును త్రిపురాంతకదేవ మహారాజు పాలించు కాలమందే అంబదేవుడీ విజయమును సాధించెను

---

1 E Indica Vol XXI P 227

2 A R No 87 of 1929 30

75 కన్న ఎక్కువ మంది రాజుల నోడించి అంబదేవుడు పంచాధిక సప్తతిక్షితిభృతుల ఖండిత శీర్షాంబుజములతో తన తీక్ష్ణ దృక్కుల నుండి ఉద్భవించిన రుషాదేవత నర్చించెను ఈ 75 మంది రాజులు లేక నాయకులు కాకతి రుద్రదేవమహారాజు సామంతులు

శ్రీపతి గణపతిని తమకు విధేయసామంతులుగ నున్న కాయస్థ రాజవంశమునకు చెందినవా డోడించుటను సహింపని కాకతి రుద్రమ, తన 75 మంది సామంత మాండలికుల నంబదేవుని శిక్షించు టకు బంపెను వారంబదేవునిపై దండెత్తిరి కాని అంబదేవుడు వారందరిని ఓడించి, కాకతి సార్వ భౌమత్వమును ధిక్కరించి స్వాతంత్ర్యము ప్రకటించెను

కాకతి సేనానులను సామంత మాండలికులను జయించిన ఉత్సాహమున అంబదేవుడు చుట్టు ప్రక్కల నున్న రాజ్యములపై దండెత్తి విజయముగాంచి విశాల కాయస్థ సామ్రాజ్యము నేర్పరచెను

**ఏఱువ సీమ** - కృష్ణానది కిరువాకుల విస్తరించియున్న భూభాగ మేఱువసీమ యనబడినది కందూరు చోడు లేఱువసీమ నేలువారు కావున వారి వంశమున కేఱువ వంశము స్థిరపడినది గంగయసాహిణి శకసంవత్సరము 1164 నాటి కేఱువ మూడు 70 లను క్రొచ్చెఱువుల రాజధానిగా పాలించుచుండెనని తురిమెళ్ళ శాసనము తెలుపుచున్నది

ఏఱువ మండలము కాయస్థుల నుండి విడిపోయినది ఏఱువ వంశీయుడగు మల్లిదేవుడు స్వతంత్రుడై, కాకతి సామంతుడై పాలించుచుండుటను సహింపని అంబదేవు డాతని రాజ్యభాగములపై దండెత్తి అతనిని యుద్ధరంగమున సంహరించి ఏఱువ మల్లిదేవని తలగొండుగండ బిరుదము వహించి, ఏఱువ రాజ్యమును కాయస్థ రాజ్యాంతర్భాగముగ గ్రహించెను

సెంతి పాలకుడగు మల్లికార్జునుడు దుర్మార్గుడు పాపకార్యాచరణుడు ధర్మమునకు గ్లాని కలిగించువాడు అంబదేవుడు తక్కిన కాయస్థ రాజులు చాతుర్వర్ణ సముద్ధరణ బిరుదము కలవారు. అంబదేవుడు ధర్మద్రోహియగు మల్లికార్జున నాయకు నోడించి, శస్త్రపూతమైన వధను వీడి, అతని సప్తాంగములను పరిగ్రహించి పారద్రోలెను

అంబదేవ మహారాజు సర్వాంధ్ర మహీపాలురను రణమం దోడించినట్లు తెలుపుటవలన, శ్రీపతి గణపతి మరణానంతరము కాకతి రుద్రమ 75 మంది మాండలిక, సామంతరాజులను కాయస్థ రాజ్యముపై దండెత్త బంపెను అంబదేవుడు రణమందు వారందరిని యోడించెను అటు పిమ్మట రుద్రమ తన ప్రధాన సేనాపతుల నేతృత్వమున ప్రచండ సైన్యమును అంబదేవునిపై దండెత్తుటకు పంపింప ఆ సైన్యమును, సేనానులను, మాండలికులను, సామంతులను అత డోడించియుండును

శకసంవత్సరము 1200 = క్రీ శ 1278 ప్రాంతమున అంబదేవుడు వైదుంబరాజగు సోమేశ్వరునితో కలిసి దక్షిణ దిగ్విజయమునకు బయలుదేరెను ఈ దండయాత్రను రాజంపేట తాలూకా నందలూరు సౌమ్యనాథస్వామి ఆలయమందున్న త్రిభువన చక్రవర్తి విజయగండ గోపాలదేవుని 29 వ రాజ్య సంవత్సరము బహుధాన్య శక సంవత్సరము 1201 = క్రీ శ 1279 నాటి శాసనము తెలుపుచున్నది

విజయగండ గోపాలుడు నెల్లూరు చోడవంశీయుడగు మొదటి తిక్కరాజు అల్లుడు ఇతడు తన అన్నయగు అల్లుతిక్కరాజు తరువాత శకసంవత్సరము 1172లో కంచి రాజ్య మాక్రమించుకొని 30 సంవత్సరములు పాలించెను విజయగండ గోపాలుడు కాడవరాయ బిరుదాంచితుడైన కొప్పెరుంజింగని స్నేహితుడు ఇతడు జటావర్మ సుందరపాండ్యునిచే పరాజితుడై అతని సామంతునిగ నుండుట కంగీకరించెను

పాండ్యరాజు లాంధ్రదేశముపై దండెత్తి కొన్ని ప్రాంతముల నాక్రమించినట్లు నందలూరు శాసనము తెలుపుచున్నది అంబదేవుడు కొప్పెరుంజింగని సంహరించి కాడవరాయ విధ్వంసన బిరుదమును వహించెనని భావింపవచ్చును ఈ సంఘటన శకసంవత్సరము 1201 = క్రీ శ 1279లో విజయగండ గోపాలుని యుద్ధయాత్రా సందర్భమున సంభవించియుండును

త్రిపురాంతకములోని క్రీ శ 1290 నాటి శాసనము వలన అంబదేవుడు కేశవదేవ, సోమిదేవులను అల్లుగంగని ఓడించినట్లు విశదమగుచున్నది

కేశవదేవ, సోమిదేవులు కలుకడ పురవరాధీశ్వరులు వైదుంబ వంశమునకు చెందినవారు అల్లుగంగ తెలుగు చోడవంశీయుడు అల్లుగంగ శకసంవత్సరము 1244 = క్రీ శ 1322 ప్రాంతమున అనంతపుర మండలమందలి జగదాల గుత్తిని పాలించిన గంగియదేవ మహారాజు తండ్రి [1]

సోమిదేవుడు ములికినాటి పాలకుడు గంగయసాహిణి సామంతుడు ఇతనినుండి శక సంవత్సరము 1178 = క్రీ శ 1256 లో గంగయసాహిణి మాసూరుపల్లి గ్రామమును గ్రహించి, మలయమండల నివాస కాలడి వాసుదేవ విప్రునకు దానమిచ్చెను [2] కేశవదేవుడే మురారికేశవదేవ మహారాజు పుష్పగిరి సమీపమందున్న చింతల పుత్తూరులోని ఇంద్రనాథస్వామి గుడిలోని శకసంవత్సరము 1190 నాటి శాసనము ననుసరించి కేశవదేవ సోమిదేవులు కలిసియే రాజ్యమేలినట్లు తెలియుచున్నది [3]

---

1 A R No 305 of 1935 36

2 E I Vol XXIV P 120

3 A R No 319 of 1905

గంగయసాహిణి తదనంతరము పాండ్యులు విజృంభించిరి కొందరు కాకతి సామంతులు రుద్రమదేవి పాలనమును, అధిపత్యమును అంగీకరింపక స్వతంత్రులగుటకు యత్నించిరి జన్నిగ దేవుడు, త్రిపురాంతకుడు కాకతి రుద్రమకు విధేయ సామంతులు వారు తమ రాజ్యవ్యవహరములను చక్కదిద్దుకొను యదనున కేశవదేవ సోమిదేవులు కాయస్థరాజుల అధికారమును ధిక్కరించి తమ రాజ్యమును విస్తరింపజేసిరి కమలాపురము తాలూకాలోని ఎల్లారెడ్డిపల్లిలో శకసంవత్సరము 1189 = క్రీ శ 1267 నాటి శాసనమున సోమిదేవుడు తాను ములికినాటిలోని హొంనహటి (హొన్నవాడి) 90 పెడ కల్లెంటు 800 రాష్ట్రములను వల్లూరు రాజధానిగా పాలించుచున్నట్లు తెలిపినాడు [1] శకసంవత్సరము 1206 = క్రీ శ 1284 నాటి రాజంపేట తాలూకాలోని గుండ్లూరు శాసనము అతని పాలనము పొత్తపినాటివర కుండెనని తెలియుచున్నది [2]

గంగయసాహిణి అధికారము హొన్నవాడి పొత్తపినాడుల వరకు వ్యాపించియుండెను జన్నిగదేవుని రాజధాని వల్లూరు అంబదేవుని రాజ్యపాలనాకాలము నాటికి హొన్నవాడి, పొత్తపినాడులను సాధించి, వల్లూరు పట్టణము నాక్రమించి దానిని రాజధానిగా చేసికొని సోమిదేవు డేలుచుండెను

అంబదేవుడు సోమిదేవ, మురారికేశవ దేవులపై దండెత్తబూనెను అంబదేవుని శక్తిసామర్థ్యముల నెఱింగి మురారి కేశవదేవ, సోమిదేవులు జగదాపి గుత్తిపాలకు డగు అల్లుగంగని సహాయ మర్థించిరి అల్లుగంగ తన సైన్యముతో వారికి సహాయపడి యుద్ధరంగమున పాల్గొనెను ఈ యుద్ధమునం దంబదేవునికి విజయము లభించెను ఈ ముచ్చురు రాజులు ఓడిపోయి పలాయితులైరి

శకసంవత్సరము 1209 = క్రీ శ 1287 నాటి కడపజిల్లా రాంజపేట తాలూకా అత్తిరాల పరశురామేశ్వరాలయమందు అంబదేవుని మంత్రి ఘోడెరాయ గంగదేవు డొక శాసన మొసంగెను [3] అందు అంబదేవుడు వల్లూరు రాజధానిగా గండికోట ములికినాడు రేనాడు, పెడకల్లెంటు, సకిలి, ఏఱువ పొత్తపినాడాది రాజ్యముల నేలినట్లున్నది కావున సోమిదేవ కేశవదేవ, అల్లుగంగలతో క్రీ శ 1287 నాటికే అంబదేవుడు యుద్ధమొనర్చి విజయము సాధించి యుండెనని భావింపవచ్చును

ఈ విజయము లంబదేవునికి కీర్తి ప్రతిష్ఠల నార్జించిపెట్టినవి శత్రువులచె రాజ్యము కోల్పోయిన నెల్లూరు పాలకుడగు మనుమ గండ గోపాలు డంబదేవు నాశ్రయించి సహాయమును కోరెను

1 A R No 226 of 1937 38

2 A R No 622 of 1907

3 S I I Vol X No 448 pages 239 240

శ సం 1204 న విజయగండ గోపాలుడు నెల్లూరు సింహాసన మధిష్టించి యుండెను నెల్లూరు రెండవ మనుమసిద్ధి తనయుడు తిక్కరాజు మనుమగొండ గోపాలుని బంధువర్గములోనివాడు సామంతులు, మాండలికులు అనుచరులు తిరుగుబాటొనర్చి విజయ గండ గోపాలుని పదవీ భ్రష్టుని గావించిరి

అంబదేవుడు తనను ఆశ్రయించిన మనుమగండ గోపాలునికి సహాయ మొనర్పదలచి, సైన్యయుతుడై నెల్లూరుపై దండెత్తెను నెల్లూరు నాక్రమించియున్న సామంత మాండలికుల నోడిం- రాజ్యమును స్వాధీన పరచుకొని మనుమగండ గోపాలుని సింహాసనాధిష్టుని గావించి, రాయస్థాపనాచార్య బిరుదము వహించెను

ఈ విజయానంతర మంబదేవ మహారాజు పాండ్యరాజులతో పోరు సలుపవలసివచ్చినది రెండవ మనుమసిద్ధి ముత్తుకూరు యుద్ధమున మరణించిన పిదప పాండ్యులు నెల్లూరు రాజ్య భాగముల నాక్రమించి యుండిరి పాండ్యుల అధికారము నా ప్రాంతమం దంతరింపజేసి కాకతి రుద్రమ దండ నాయకుడగు ఆదినాగదేవుడు, నెల్లూరు ప్రాంతముల నేలుచుండెను అటుపిమ్మట మనుమసిద్ధి తనయుడు తిక్కరాజా భూభాగములను రెండు సంవత్సరములు పాలింపగలిగెను తరువాత మనుమగండ గోపాలుడు రాజయ్యెను

శకసంవత్సరము 1190 = క్రీ శ 1268 లో మారవర్మ కులశేఖర పాండ్యుడు పాండ్య రాజ్య పీఠమం దాసీనుడయ్యెను ఇతడు బలవంతుడు శూరుడు నెల్లూరు రాజ్యము తమ అధికారము నుండి జారిపోవుటను సహింపలేక, ఆ రాజ్య భాగముల నాక్రమించుటకు దండయాత్రలు నిర్వహింప దలచెను

అతడు శకసంవత్సరము 1200 = క్రీ శ 1278 లో పొత్తపి నాటిని చేరి గండగోపాల, కాడవరాయల నేతృత్వమున సైన్యమును నడిపించెను ఈ దండయాత్రలు సత్ఫలితముల నీయలేదు మరల కులశేఖర పాండ్యుడు నెల్లూరుసీమ నాక్రమించుటకు, సంసిద్ధుడయ్యెను కాని కాయస్థ రాజ్య మున పరిస్థితులు మారినవి వైదుంబ వంశీయులగు సోమిదేవ కేశవ దేవులను, అల్లు గంగను అంబ దేవుడోడించి పొత్తపి నాటి నాక్రమించుకొని, నెల్లూరులో మనుమగండ గోపాలుని సింహాసనాధిష్టుని గావించెను ఆ సమయమున నెల్లూరు సీమ నాక్రమించుటకు కులశేఖర పాండ్యునికి తప్పనిసరిగా అంబ దేవునితో పోరాటము సలుపవలసి వచ్చినది

పాండ్య సైన్యము ముందుకుసాగి నెల్లూరు, పొత్తపినాడుల నాక్రమించెను అంబదేవుడు ప్రచండ సైన్యముతో పాండ్యసేనల నెదిరించి విజయము గాంచెను కావుననే అతడు ప్రత్యనీక

ప్రాసాదాయమాన కులశేఖర గండడనియు, నద్వంద్వుడై శత్రు సైన్యవిషనిధిని ద్రచ్చి యాశ్వికహాస్తిక బలమును పంచపాండ్య కల్పవృక్షములను గైకొని నశింపని కీర్తి గడించినాడని'' త్రిపురాంతక శాసనము తెలుపుచున్నది [1]

పాండ్యులకు సంబంధించిన నెల్లూరు పొత్తపి నాడులలోని శాసనముల వలన అంబదేవు డంతటి ఘనవిజయము గాంచలేదని తెలియుచున్నది నెల్లూరులోని రంగనాయకస్వామి దేవాలయ పశ్చిమ ప్రాకారకుడ్యముపై త్రిభువన చక్రవర్తి కోనేరిన్మైకొండాన్ సుందరపాండ్యుని శాసనమున్నది ఇందు శాసనకాలమును సూచించుభాగము శిథిలమైనది కాని కళింగరాయని విన్నపముపై సుందర పాండ్యుడు ముండనాటిలోని మావడికుండై (మామిడిపూడి) గ్రామమును విక్రమసింహపురమును నెల్లూరు చిత్రమేటి విణ్ణగరి పళ్ళికొండ పెరుమాళ్ళకు దానమిచ్చినట్లున్నది [2]

సుందరపాండ్య కళింగరాయలు ఎవరను విషయమున అభిప్రాయ భేదములున్నవి వీరు రెండవ జటావర్మ సుందరపాండ్యుడు అతని సామంతుడైన కళింగరాయడు కావచ్చునని డా॥ నేలటూరి వేంకటరమణయ్య గారి అభిప్రాయము [3]

రెండవ జటావర్మ సుందర పాండ్యుని ఆరు శాసనములు కడప జిల్లా రాజంపేట తాలూకా లోని నందలూరు గ్రామమునందున్నవి అందు మూడు శాసనము లాతని 10 వ రాజ్య సంవత్సరము నాటివి

అందు పాండి మండల తిరుమలకై కూర్ర మందున్న తుజ్ఞలూరు నివాసి ఎదుత్తకైయల గియారను పేరుగల పిళ్ళైపల్లవరాయడను నతడొసంగిన దానమును తెలుపున దొక శాసనము [4]

ఎళ్ళై పల్లవరాయడు దేవాలయమునకు పుష్పవాటికను వేయించినట్లున్న శాసనము రెండవది [5]

ఎళ్ళైపల్లవరాయడు పూదోట వేయించుటకు గాను సువర్ణదాన మొసంగుట వేయించిన శాసనము మూడవది [6]

---

1 త్రిపురాంతక దేవాలయ శాసనములు శా నెం 72
2 నెల్లూరు జిల్లా శాసనములు Vol II P 830 32
3 సాహితీ వాల్లభ్యము P 306
4 A No 592 of 1907
5 A No 591 of 1907
6 A No 593 of 1907

సుందర పాండ్యుని 17 వ రాజ్య సంవత్సరము విరోధిలో వేయించిన శిథిల శాసనము నాల్గవది [1]

పిళ్ళై పల్లవరాయనిచె సుందరపాండ్యుని 17 వ రాజ్య సంవత్సరమున 'జయంగొండ చోళమండల మందలి మణవిల్కొట్టమునకు జెల్లు తోయారునాటి తోయారు గ్రామస్థుడు సౌమ్యనాథ స్వామికి, అమ్మవారికి తిరుమంజనము చేయించుచు వేయించిన శాసనము ఐదవది [2]

రాజాజ్ఞ గైకొని తొండైమాన్ తిరునల్వేలియుడైయార్ నందివర్మ పేర ఎవ్వరో పూందోట వేయించుచు వేయించిన శాసన మారవది [3]

ఇందు పేర్కొనబడిన సుందర పాండ్యుడు శకసంవత్సరము 1207 = క్రీ శ 1285 లో సింహాసన మధిష్ఠించెను ఇతని 15 వ రాజ్య సంవత్సరము శకసంవత్సరము 1212 = క్రీ శ 1290 కి, 17 వ రాజ్య సంవత్సరము శకసంవత్సరము 1214 = క్రీ శ 1292 కు సమానము

రాజంపేట తాలూకా వేపాక గ్రామమున మారవర్మ సుందరపాండ్యుని 18 వ రాజ్య సంవత్సరము నాటి శాసనమున్నది ఈ రాజెవరో తెలిసికొనబడలేదు కేన్వాక్కై-విణ్ణగరమను కేశవ పెరుమాళ్ళ గుడి కెదుట మిఱలైకూట్రమునకు సంబంధించిన నడ్వర్‌కూట్రులోని తుంజలూరు రాజగు పల్లవరాయని పేర పల్లవరాయన్ తిరువీధి నేర్పరచుటకు భూదాన మీయబడినట్లీ శాసనము తెలుపుచున్నది

తుంజలూరు రాజు పల్లవరాయుడు జటావర్మ, మారవర్మ సుందరపాండ్యుల సమకాలికుడు, కావున జటావర్మ మారవర్మ, సుందరపాండ్యులు సమకాలికులు

శకసంవత్సరము 1207 నుండి 1214 వరకు పొత్తపినాటిలోని కొన్ని భాగములను పాండ్య రాజు లేలుచుండిరి శకసంవత్సరము 1212 నాటికి పూర్వ మంబదేవుడు పాండ్యులను సంపూర్ణముగ నోడించిన యెడల శకసంవత్సరము 1214 నాటికి పాండ్యుల శాసనము లా ప్రదేశమం దెట్లుండగలవు? కావున అంబదేవుడు క్రీ శ 1292 నాటికి పొత్తపినాడును సంపూర్ణముగ జయింపలేదని భావించుట కవకాశమున్నది

---

1 A R No 590 of 1907

2 A R No 588 of 1907

3 A R No 594 of 1905

అంబదేవ మహారాజు విజయములను గాంచి అన్యరాజవంశీయు లతని సహాయమును కోరి కానుక లర్పించి స్నేహమును కాంక్షించిరి అందుకు వారికి కాకతి ప్రభువుల యెడ గల వైరవే కారణము అంబదేవునివంటి బలవంతుని కాకతి ప్రభువులకు శత్రువుగా మార్చుటలో వారు కృతకృత్యు లైరి అట్టివారిలో దేవగిరి యాదవరాజు ప్రథమ గణ్యుడు

దేవగిరి రాయ ప్రస్థాపిత ప్రాభృత మణికనకభూషణ అను అంబదేవుని బిరుద మీ విషయ మును ధృవపరచుచున్నది

రెండవవాడు పాండ్యప్రభువు అతిపాండవ పరాక్రముడు ప్రేమతో చండవేతండములను వైనతేయ జంఘాల తురంగములను, ధనమును ఇచ్చి తన సౌహార్దమును ప్రకటించి అంబదేవుని చెలిమిని కోరెను [1] వీరిరువురు రాజన్యులు అంబదేవుని స్నేహ మభిలషించి కాకతి ప్రభువులకు అతనిని శత్రువుగా మార్చివేసిరి

కాకతి సామ్రాజ్య పశ్చిమ భూభాగములను సేవుణు లాక్రమించి యుండిరి గణపతిదేవుని అవసానదశయందు పాండ్యులు విజృంభించిరి రుద్రమదేవి అబలయని ఉపేక్ష వహించిరి ప్రతాప రుద్రుడు బాలుడని బావించిరి

అంబదేవుడు బలసంపన్నుడు విశాల భూభాగమున కధిపతి అతనికి ధనకనక వస్తువాహన ములు, తురంగములు కానుకగా సమర్పించి అతని మైత్రిని పొందిరి అంబదేవుడు సహజముగా ఉద్రేక స్వభావి అల్పసంతోషి నీయంతటి ధీరుడు శూరుడు లేడనిన ఉబ్బి తబ్బిబ్బై ఎంతటి ఘనకార్యమైనను చేయబూను స్వభావి కావున సేవుణ పాండ్యరాజుల కానుకలకు సంతసించి, వారి మైత్రిని పొంది, కాకతి రుద్రదేవమహారాజుపై కాలుద్రువ్వెను అనేక విజయములను సాధించిన అంబదేవుడు కాకతి శత్రువుల సహాయ సహకారమున అజేయుడై స్వతంత్ర కాయస్థ రాజ్యము నతి వైభవముతో పాలింప సాగెను రుద్రమదేవి సైన్యముల నాయత్తపరచి అంబదేవునిపై దండయాత్రలు నిర్వహించినను విజయము అంబదేవునే వరించెను

కాకతి రుద్రమదేవి మరణానంతరము ప్రతాపరుద్రుడు ఓరుగల్లు సింహాసన మధిష్ఠించెను అతడు నాయంకర వ్యవస్థను పటిష్ఠ మొనర్చెను చక్కని యుద్ధవ్యూహములను రచించుటలో నైపుణ్యము గల ప్రతాపరుద్రుడు అంబదేవునిపైనను, అతని మిత్రులపైనను ఒకే పర్యాయము దండయాత్రలు నిర్వహించు పథకముల నేర్పరచెను

---

1 త్రిపురాంతక దేవాలయ శాసనములు శా నెం 72

అంబదేవునిపై దండయాత్ర లారంభమైనవి కాకతి ప్రతాపరుద్రుడు, అతని సేనానులు యుద్ధరంగములందు పట్టుదలతో పోరాడి అంబదేవుని, అతని మిత్ర బృందమును ఓడించిరి ఏఱువ ఆది ప్రాంతములు కాకతిసేనల వశమయ్యెను అంబదేవుని చివరి శాసనము త్రిపురాంతకమున గల శకసంవత్సరము 1213 = క్రీ శ 1291 ఖర ఆషాఢ మాసమునాటిది

కాకతి రుద్రమ మహాప్రధాని (కంట్టులూరి) ఇందులూరి గన్నయ కుమారు డన్నలదేవుడు, త్రిపురాంతక మహాదేవునికి ఖర సంవత్సర శ్రావణ శుద్ధ 15 మంగళవారము నాటి సోమగ్రహణ కాలమున అఖండ దీవమునకు 50 మోదాలు దానమిచ్చుచు శాసనమును వేయించెను [1]

రుద్రదేవ మహారాజుల సాహిణి సోమయ పెద్దయ సాహిణి దాన శాసనము త్రిపురాంతకమందున్నది [2] అది ఖర కార్తిక శుద్ధ 15 గురువారము నాటిది కాకతి ప్రతాపరుద్రునికి పుణ్యముగా నొక శాసన మిచట వేయింపబడినది

కావున కాయస్థ ప్రభువుల పాలనమునసున్న త్రిపురాంతక ప్రాంతము కాకతీయుల వశమైనట్లు చెప్పవచ్చును

శక సంవత్సరము 1213 = క్రీ శ 1291 తరువాత అంబదేవుని శాసనములు త్రిపురాంతకమున గాని మరి ఎచ్చటను గాని కనిపించుటలేదు కావున కాయస్థుల రాజ్యభాగములలో నత్యధికము కాకతి సామ్రాజ్యమున విలీనమైనవి

కాకతి సైన్యములోని ఒక భాగము నెల్లూరుపై దండెత్తెను రుద్రదేవ దక్షిణ భుజాదండ బిరుదము గల ఆడిందమల్లు నెల్లూరుపై దండయాత్ర నిర్వహించి, మనుమగండ గోపాలుని వధించి "మనుమగండ గోపాల శిరఃఖండన బిరుదమును పొందెను [3] ఈ యుద్ధము శకసంవత్సరము 1212 = క్రీ శ 1290 లో జరిగినది నెల్లూరు రాజ్యపీఠముపై రాజగండ గోపాలుడు శకసంవత్సరము 1212లో అధివసించెను [4]

---

1 త్రిపురాంతక దేవాలయ శాసనము S11 vol X No 467

2 త్రిపురాంతక దేవాలయ శాసనము S11 vol X No 468

3 A R No 179 of 1905 and S 11 Vol X No 479

4 రాజగండ గోపాలుని శాసనములు నెల్లూరు శాసన సంపుటములందు ప్రకటింపబడినవి ఇవి అతని 9 12 25 రాజ్య సంవత్సరముల నాటివి నెం 60, 62, 65 115

రాజగండ గోపాలుడు కాకతీయులవలన సహాయమును పొంది సింహాసన మధిష్ఠించి, వారికి వ్యతిరేకియై పాండ్యరాజులతో సఖ్యముగనుండెను కాకతి రెండవ ప్రతాపరుద్రుడు నెల్లూరు రెండవ మనుమసిద్ధి మనుమడును, నల్లసిద్ధి తనయుడునునగు మనుమగండ గోపాలుని యధీనమున సైన్యమును పాండ్యులపై దండయాత్ర నిర్వహించుటకు పంపించెను రెండవ మనుమసిద్ధి మరణానంతరము నల్లసిద్ధి గుంటూరు సీమలోని నర్సరావుపేట ప్రాంత సామంతరాజ్యమును పాలించుటకు ప్రతాపరుద్రునిచే నియమింపబడెను అతని తనయుడే మనుమగండ గోపాలుడు కాకతి ప్రభువున కాప్తవర్గములోనివాడు పాండ్యరాజులపై దండయాత్ర నిర్వహించుటకు ప్రతాపరుద్రుడితనిని సైన్యాధ్యక్షునిగ నియమించెను

శకసంవత్సరము 1219 హేవళంబి = క్రీ శ 1297 నాటి నర్సరావుపేట శాసనమందితడు దక్షిణదేశ దండయాత్రను విజయవంతముగ ముగించినట్లున్నది [1] ఇందితడు రాజగండ గోపాలుని విహితులైన యహితుల మానభంగ మొనర్చినట్లును ద్రావిడ బలవార్ధి బడబానలుడైనట్లును వర్ణింపబడినాడు

మనుమగండ గోపాలుడీ యుద్ధమున ద్రావిడులనే కాక సేవుణులను సైత మోడించినట్లీ శాసనము తెలుపుచున్నది సేవుణ కటక వేణు కబళన దావపావక బిరుదము నితడు వహించినట్లు తెలుపబడినది ఈ విజయ మితనికి గోన విఠలుని కృష్ణా తుంగభద్రల నడిమ భూభాగ సాధన సమయమున కలిగియుండవచ్చును

శక సంవత్సరము 1219 హేవళంబి నాటి రాయచూరు కోటలోని శిలా శాసనమున తాను బళ్ళారిమండల అదవాని, తుంబుల దుర్గములను సాధించి అటుపిమ్మట అంతర్వేదిని చొచ్చి మానువ, హాళువ దుర్గములు వశవరచుకొని, అచటి రాజులను జయించి రాయచూరు నాక్రమించి అచట బలిష్ఠమైన దుర్గమును నిర్మించినానని ' గోన విఠలుడు తెలిపెను [2]

సేవుణ రాజుల పాలనములో మానువ, హాళువ, అదవాని, తుంబుల, రాయచూరు దుర్గములుండెను ఈ దండయాత్రయందు మనుమగండ గోపాలుడు గోనవిఠలునికి సహాయముగ నుండెను కావుననే సేవుణులపై విజయము సాధించినట్లు తెలుపుకొనెను

కాకతి సేనానులు ప్రచండ సైన్యముతో దండయాత్రలు నిర్వహించి, యాదవ, పాండ్య రాజుల సైన్యమును, అంబదేవుని అతని అనుచరులను ఓడించిరి ఈ యుద్ధానంతరము పాండ్యులాంధ్ర

1 S I I Vol IV No 661
2 కాకతీయ సంచిక పుటలు 83 84, 85

భూభాగములను వీడి ద్రావిడ దేశమును చేరిరి యాదవులు ఆక్రమించిన కాకతి భూభాగములను వీడి మహారాష్ట్రమును చేరిరి

అంబదేవుడు సర్వస్వమును, మిత్రులను బంధువులను కోల్పోయెను అతని రాజ్యములోని అత్యధిక భాగములు కాకతి సేనల హస్తగతమయ్యెను, ఐనను అంబదేవుడు కాకతి ప్రతాపరుద్రునకు లొంగలేదు శక సంవత్సరము 1213 నుండి 1224 వరకతడు ములికినాడు, పొత్తపినాడులను స్వతంత్రముగ పాలించెను [1]

ఈ ద్వాదశ వర్షము లంబదేవునికి సవ్యముగ సాగినవి కాకతి ప్రతాపరుద్రుడు చక్కని వ్యూహరచన గావించి తిరుగుబాటు దారులను, శత్రువులను ఓడించి, కాకతి రాజ్యకీర్తి ప్రతిష్ఠలను ఇనుమడింపజేసెను

## అంబదేవుని తరువాతి రాజులు

అంబదేవ మహారాజున కిరువురు తనయులు, ఒక కుమార్తెయు నుండిరి రెండవ త్రిపురారి అంబదేవుని యనంతరము కాయస్థ రాజ్యపీఠ మధివసించెను అంబదేవుని కుమార్తె వేలూరి మనుమబొల్ల తనయుడగు రాజన్నను వివాహమాడెను అంబదేవు డల్లుని కరణముగా నందనపుర రాజ్య మిచ్చి యుండెను [2]

కాకతీయుల శాసనములందు బొల్లయ, అతని తనయుడు రాజరుద్రుడు పేర్కొనబడినారు కర్నూలు జిల్లా నందికొట్కూరు తాలూకా మల్యాల గ్రామమున శక సంవత్సరము 1212 వికృతి నాటి శాసనమున కాకతి రుద్రకుమారుని సామంతులు మహాసామంత చెఱకు బొల్లయరెడ్డి, అతని తనయుడు రాజరుద్రుడు ప్రశంసింపబడినారు

అదే తాలూకాలోని లింగాల గ్రామమున శకసంవత్సరము 1213 నందన నాటి శాసనమున ప్రతాపరుద్రుని అధికారమునకు లోబడి, మహాసామంత వేలూరు చెఱకు బొల్లయ అతని తనయుడు రాజరుద్రుడు పేర్కొనబడినారు ఈ శాసనములందు పేర్కొనబడిన బొల్లయ, రాజరుద్రు లొక్కరే అంబదేవుని వియ్యంకుడు చెఱకు వేలూరు మనుమబొల్ల అతని తనయుడు రాజరుద్రుడు అంబదేవుని కల్లుడు వీరు అంబదేవున కాప్తవర్గములోనివారు

---

1 A R No 207 324 of 1935 1936 404 of 1911

2 త్రిపురాంతక దేవాలయ శాసనములు శా నెం 72

దోనేరు కోనేరనాథ కవి కృత ద్విపద బాలభారతమున బొకు రాజ వంశమందు-

నవి తారి తాత పిన్న మహీవిభుండు, సమితిలో చెఱకు రాచ నరేంద్రు గెలిచి అలవుగా సప్తాంగ హరణంబొనర్చి పొలుపొందె భువి మన్నెపులియని పేర [1]

రామరాజీయమున సమస్త దురాచరణ చెఱకు రాజనాయక సప్తాంగహరణ బిరుద ముటంకింప బడినది [2]

అరవీటి వంశమునకు మూలపురుషుడు తాత పిన్నమ ఇతని పెద్ద కొడుకు కొటికకంటి రాఘవుడు శక సంవత్సరము 1242 లో కాకతి ప్రతాపరుద్రుని సైన్యమున కాధిపత్యము వహించి కుంమరముపై దండెత్తి, ఇచటి పాలకుడగు కంపిలి రాయల నోడించి అతని సప్తాంగములు హరించెను [3]

రాఘవుని రెండవ కుమారుడు సోమిదేవుడు శక సంవత్సరములు 1250-1258 ల మధ్య ముస్లిం రాజ్యములోని కంపిలిపై దండెత్తి నాగులపాడు, సాతానికోట, ముసలిమడుగు, ఆనెగొంది, ముద్గలాది దుర్గములను జయించెను [4] కావున తాతపిన్నమ కాలము శకసంవత్సరము 1200-1225 = క్రి శ 1278-1303

తాతపిన్నమ కాకతి సామంతుడు రుద్రదేవ మహారాజు ఆజ్ఞానుసారము చెఱకు రాజరుద్రునిపై దండెత్తి యుద్ధరంగమునం దతని నోడించెను అంబదేవు డవిధేయుడై కాకతి శత్రువులతో స్నేహ మొనర్చి తిరుగుబాటు చేసి స్వంతంత్రుడై యున్నతరి అతని అల్లుడగు రాజరుద్రునిపై చర్య గైకొనుటకు రుద్రమదేవి తాతపిన్నమ నాదేశించి యుండును

చెఱకు వంశీయులు కాకతీయులకు సామంతులు చెఱకు మొదటి బొల్లయరెడ్డి కాకతి రుద్రదేవుని స్నేహితుడు మహా సామంతాధిపతి కాకతి రుద్రున కనేక యుద్ధములందు విజయము చేకూర్చినవాడు జమ్ములూరు, అమరాబాదు మహా సామంతరాజ్యమును కాకతి రుద్రదేవుని అనుగ్రహమున బడసినవాడు

---

1 భారతి శుక్ల జ్యేష్ఠ Vol VI P 848
2 Sources of Vijayanagara history P 79
3 భారతి శుక్ల జ్యేష్ఠ Vol VIP 849
4 భారతి శుక్ల జ్యేష్ఠ Vol VIP 848

చెఱకు రెండవ బొల్లయ మొదటి కుమారుడు పెద్దదేవయ, కర్నూలు జిల్లాలోని వేలూరు మహాసామంత రాజ్యపాలకుడు అతని కుమారుడు వేలూరి మనుమబొల్ల మనుమబొల్ల తనయుడు రాజరుద్రుడు

పూర్వము తమ వంశీయు లొనర్చిన సేవలను పురస్కరించుకొని మనుమబొల్ల, అతని తనయుడు రాజరుద్రుడు ప్రతాపరుద్రుని విధేయ సామంతులుగ మారి, అంబదేవునితోగల సంబంధములు వదులుకొనిరి కాకతి ప్రతాపరుద్రుడు రాజరుద్రునికి అతని పూర్వీకులకు చెందిన నల్లగొండ మండలములోని జమ్ములూరు (జలాల్పురము) రాజ్యమును వేలూరు రాజ్యమున కనుబంధముగ ననుగ్రహించెను

కావుననే రాజరుద్రుడు జమ్ములూరు మహాసామంత రాజ్యమందున్న గోరువంకపల్లి, కూరెళ్ళ గ్రామములను దానమిచ్చుచు శాసములను వేయించెను [1]

కడప జిల్లా సిద్ధవటము తాలూకా పట్టపురాయ గ్రామ శాసనమున అంబదేవ, జన్నియదేవ మహారాజుల కభ్యుదయము కలుగునట్లు వారి అనుచరుడు ఆలయమునకు ఉత్సవమాన్యమును ధారవోసి యిచ్చినట్లున్నది [2]

అంబదేవునితో కలిపి పేర్కొనబడిన జన్నయ అతని తనయుడై యుండును జన్నిగదేవుడు, త్రిపురాంతకుడు అంబదేవుని సోదరులు వారిపైగల గౌరవ భావమున తన కుమారులకు వారి పేర్ల నంబదేవుడు పెట్టియుండును జన్నయ ఏదేని ఒకానొక యుద్ధమున దివంగతుడు కాగా, అంబదేవుని రెండవ కుమారుడు త్రిపురారి దేవుడు తండ్రి యనంతరము కాయస్థ రాజ్య సింహాసన మధిష్టించెను

## అంబదేవుని అమాత్యులు

కడప జిల్లా రాజంపేట తాలూకా లేబాక గ్రామమందలి చెన్నకేశవాలయమున గల తమిళ శాసనమున అంబదేవుని సర్వాధికారి ఇరుమది దేవుని కుమారుడగు గంగదేవుని ప్రశంస యున్నది [3]

---

1 చెఱకు రెడ్డి వంశ చరిత్ర శాసనములు పుటలు 61-66 67 72

2 A R No 98 of 1939-40

3 A R No 428 of 1911

శక సంవత్సరము 1209 సర్వజితు = క్రీ శ 1287 నాటి అత్తిరాల పరశురామేశ్వరాలయ శాసనమున మహా ప్రధాని ఘోడెరాయ గంగదేవుడు అంబదేవున కాయురారోగ్యైశ్వర్యాభివృద్ధికి భూమి దానమిచ్చినట్లున్నది [1]

సిద్ధవటము తాలూకాలోని బ్రాహ్మణపల్లి చెఱువు కట్టపై శక సంవత్సరము 1212 వికృతి = క్రీ శ 1290 నాటి శాసనమున మహా ప్రధాని ఘోడెరాయ గంగదేవయ రావులకొలను గ్రామమున చెఱువు నిర్మించి ఎల్ల లేర్పరచి కొంత భూమిని దానమిచ్చినట్లు తెలుపబడినది [2]

ఘోడెరాయ గంగయ దేవుడు మహాప్రధాని అత డనేకములైన పాలనా సంస్కరణములను కాయస్థ అంబదేవుని రాజ్యమున ప్రవేశ పెట్టెను రాజ్యాభివృద్ధికి కృషి చేసెను చెఱువులు, కాలువలు త్రవ్వించి నీటిపారుదల సౌకర్యములేర్పరచి, వ్యవసాయాభివృద్ధికి తోడ్పడెను ఇతడు మంత్రి మాత్రమే కాడు, శైవమతాచార్యుడుకూడ ఘోడెరాయ గురుపీఠమును నెలకొల్పినవాడు అద్దంకి రాజ్యస్థాపకుడగు కొండవీటి ప్రోలయవేమారెడ్డికి గురువు ఇతని దయవలన ప్రోలయవేమారెడ్డి రాజ్యస్థాపన మొనర్చెనని ఎఱ్ఱన హరివంశము తెలుపుచున్నది

శ్రీ పర్వతేశ భక్తి ఖ్యాపిత గుణ ఘోడెరాయ గంగ గురుకృపా స్థాపిత సామ్రాజ్యసముద్దీపిత వేమక్షితీంద్ర దీప్తిదినేంద్రా [3]

వేమారెడ్డి అహోబలం, శ్రీశైలక్షేత్రములందు సోపానములు నిర్మించెను [4] ప్రోలయ వేముని తమ్ముడు మల్లారెడ్డి, కురుములూరి పాలకుడు

సకల ద్వీపాంతర రత్నకలాప నిరంతరార్చనా కలనారంభక కురుములూరి పురనాయకమల్ల చమూవరేణ్యహరి నిషేవ్యా [5]

కురుములూరు కడప జిల్లా సిద్దవటము తాలూకాలోనిది ప్రోలయ వేమారెడ్డి తొలుత అంబదేవుని కాశ్రితుడై యుండి, ఘోడెరాయ గంగదేవుని సహాయమున రాజ్యస్థాపన మొనర్చెను

---

1 A R No 406 of 1911

2 A R No 8 of 1939 40

3 హరివంశము ఉత్తర 4 1

4 C P No 5 of 1919 20 S i i Vol VI No 226

5 హరి వంశము 1 198

అంబదేవుని అనుచరులలో ఖదేవుడు ముఖ్యుడు అతడు శక సంవత్సరము 1213 ఖర నాటి ఆషాఢ శుద్ధ 15 బుధవారము పవిత్రారోపణ పుణ్య కాలమున శ్రీ త్రిపురాంతక మహాదేవునికి దాన మిచ్చుచు శాసనమును వేయించెను [1]

సవదర అంబయరెడ్డి మనుమకులవార్థివర్ధన సుధాకరుడు నలంపఋువకు రాజు అంబదేవ మహారాజులు ఎఱ్వ చెల్లించుకొన్ననాడు త్రిపురాంతక మహాదేవుని అఖండ దీపమునకు 50 మోదలు, 1 సలగ ఎద్దు, ఒక ఆంబోతును దానమిచ్చుచు శాసనము వేయించెను [2]

త్రిపురాంతక మహాదేవుని భక్తుడైన అంబదేవుడు శకసంవత్సరము 1212 వికృతి భాద్రవద బహుళ 15 సూర్యగ్రహణ కాలమున త్రిపురాంతక మహాదేవునికి ప్రాతఃసంధ్య మధ్యాహ్నసంధ్య నడుమ తన పేర ఒక అవసరమును కల్పించుచు శాసన మొసంగెను [3]

అంబదేవుడు త్రిపురాంతక దేవర ఊళ్ళను కానికె ఆదిసమస్తమును మన్నించుచు శక సంవత్సరము 1212లో నొక శాసనమును వేయించెను [4] అట్లే నతడు త్రిపురాంతక క్షేత్రవాసులైన నరెంద్రదేవుల మల్లినాథయంగారికి మొల్లకల్లూరు సర్వబాధా పరిహారముగ ఆచంద్రార్క స్థాయిగా శివపురము చేసి యిచ్చు సందర్భమునం దొక శాసనమును వేయించెను [5]

అంబదేవ మహారాజు శివపూజా ధురంధరుడు త్రిపురాంతక మహాదేవున కనేక అగ్రహారములను కానుకలను సమర్పించుటయే గాక, తన ఏలుబడిలోనికి వచ్చిన పిదప త్రిపురాంతక మహాదేవునికి గల పూర్వాగ్రహారములను మన్నించి పునర్దత్తము గావించి చిరయశమును పొందెను

## రెండవ త్రిపురారిదేవుడు

అంబదేవ మహారాజు కాయస్థ రాజ్యమును శకసంవత్సరము 1224 వరకు పాలించెను అతని తనయుడు రెండవ త్రిపురారి దేవుడు శకసంవత్సరము 1224 లో కాయస్థ రాజ్యరమావల్లభు డయ్యెను త్రిపురారికి సంబంధించిన రెండు శాసనములలో నొకటి కడప తాలూకా లేబాక గ్రామమందున్నది అందు మహామండలేశ్వర త్రిపురారిదేవ మహారాజు ములికి నాటిలోని వల్లూరు పట్టణము రాజధానిగా

---

1 త్రిపురాంతక దేవాలయ శాసనము శా నెం 78 పుట 178
2 త్రిపురాంతక దేవాలయ శాసనము శా నెం 69 పుట 129
3 త్రిపురాంతక దేవాలయ శాసనము శా నెం 71 పుట 131
4 త్రిపురాంతక దేవాలయ శాసనములు నెం, 72
5 E I Vol XXV P 278

పృథ్వీపాలన మొనర్చుచు, శకసంవత్సరము 1226 క్రోధన వైశాఖ శుద్ధ షష్ఠి బృహస్పతి వారమున లేబాక యలారనాథస్వామికి శ్రోత్రియ సర్వమాన్యముగ చేసి భూదాన మొసంగినట్లున్నది [1] త్రిపురారి ఈ శాసనమున తన తండ్రి పేరు తెలుపలేదు కాని సిద్ధవటము తాలూకా వరికుంట గ్రామమందున్న శాసనమున తాను అంబదేవ మహారాజు తనయుడననియు, శకసంవత్సరము 1226 క్రోధన చైత్ర శుద్ధ సప్తమి గురువారమునాడు సకలి సీమలోని వరికుంట గ్రామమును సాదసుంకము అష్టాయములతో కూడ సర్వమాన్యముగ సిద్ధనాథ దేవరకు దానమిచ్చినట్లు తెలిపెను [2]

త్రిపురారి దేవుని పాలనము చాల కాలము కొనసాగలేదు కాకతి ప్రతాపరుద్రుని సేనాని మహారాయ పట్టసాహిణి సోమయ నాయకుడు ప్రభువు ఆనతిన సైన్యయుతుడై కాయస్థ రాజ్యముపై దండెత్తి జయము గాంచెను ఇందులూరి అన్నయ వంటి మహాసేనాను లతని ననుసరించి యుండిరి కాయస్థ రాజ్యము కాకతి రాజ్యమున విలీనమయ్యెను

కడప జిల్లా జమ్మలమడుగు తాలూకా దేవిగుడి గ్రామమున తల్లకంటేశ్వరి గర్భాలయ ఉత్తర భాగమున శక సంవత్సరము 1231 నాటి సౌమ్య ఫాల్గుణ శుద్ధ సప్తమి గురువారము నాటి శాసనమున మహారాయ పట్టసాహిణి సోమయనాయని వారు తత్ప్రాంత దేశమును పాలించుచుండ నాగరాజు అయ్యావ రాజు తనయులు బయ్యన చిన్నయలను శుల్కాధికారులు తాము వసూలు చేయు మార్గ సుంకములో తల్లంటి దేవి ఆఖండదీపారాధనకు నెల ఒక్కొటికి రెండు రూకలు దాన మొనర్చినట్లున్నది [3]

కర్నూలు జిల్లా నంద్యాల తాలూకాలోని కానాల గ్రామమునందున్న శాసనమున కాకతి ప్రతాపరుద్రదేవ మహారాజు ఓరుగల్లు రాజధానిగా పృథ్వీ రాజ్య మేలుచుండ నతని పక్షమున రాయపట్ట సాహిణి సోమయ నాయకుడు గండికోట, ములికినాడు పెనంపాడి, పొత్తపినాడు, పెడకల్లు, నతవాడి విషయములను పాలించుచు, శక సంవత్సరము 1230 లో కోనాల మూలస్థాన నాగనాథ దేవునికి భూదానము చేసినట్లున్నది [4] క్రి శ 1308 నాటికి కాయస్థ రాజ్యమంతయు కాకతి రాజ్యమున చేరి యుండెనని భావింపవచ్చును ఇంతటితో కాయస్థ మహాసామ్రాజ్య మంతరించినది

— ० —

1 A R No 391 of 1938 39

2 A R No 65 of 1939 - 40

3 ఆంధ్రుల చరిత్ర Vol V P 548 - 549 శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు

4 A R No 260 of 1935 36

# కాయస్థ రాజ్యమందలి సీమలు - గ్రామ నామములు

త్రిపురాంతకము
దుర్గి
పుష్పగిరి
గంగవరము
ఇటుగుల్లపాడు
పొందలూరు
కారెంపూడి
అట్లూరు
అక్కలరెడ్డిపల్లి
బ్రాహ్మణపల్లి
వరికుంట
లేబాక
చిట్యాల
నీలగంగవరము
గుండ్లూరు
పాల్వాయి
బద్వేల్
కడప
నెల్లూరు
క్రౌంచేటుపులకోట
గురిందాల (గురిజాల)
పొత్తాపినాడు
జగదాపిగుత్తి
దువలికంపనము
లోయలపల్లి,
రెడ్లపల్లి

నెయ్యూరు
నాగార్జునునికోట
జ్యోతిసిద్ధవటము
అబ్బవరము
అండపురము
మోరట
పలనాటిసీమ
రాజంపేట
సత్రశాల
పానుగల్లు
గండికోట - మనోరథపురము
వల్లూరు
మార్జవాడి
కైవారముకోట
రేనాడు
దర్శి
ఏటువత్రి సప్తతిదేశము
నాగులవరము
కమలాపురము
నందలూరు
పొడదుర్తి
కలుకడపురము
రాయచోటి
రాయన్నారాయణపుత్తూరు
మాచుపల్లి - మాసూరుపల్లి
మలయమండలము

ములికినాడు
కాంచీపురము
ముత్తుకూరు
ద్రాక్షారామము
తురుమళ్లపాడు - తురుమెళ్ళ
గండ్రికోట అనుంగురాజువల్లి
సకలసీమ
ముడమల
శ్రీశైలము
పొందలూరు - పురుందలూరు
అధిరాజచోళ మండలము
పాకనాడు
పొత్తపినాడు
తాళ్ళవల్లి
కర్నూలు
గిద్దలూరు
పొట్లపాడు
అలవులపాడు
రాయచూరు
నర్సరావుపేట
గుంటూరుసీమ
మావడికుండై = మామిడిపూడి
పెదకల్లెంటు
హొన్నవాడి
ఎల్లారెడ్డివల్లి
చింతల పుత్తూరు
తుంజలూరు
వేపాక
తోయూరు
తోయూరునాడు

జయంగొండ చోళమండలము
మానువ
హోళువ
తుంబల
అదవాని
ద్రావిడ దేశము
నందికొట్కూరు
మహారాష్ట్రము
మల్యాల
లింగాల
కుంమరము
సాతానికోట
ముసలిమడుగు
ఆనెగొంది
ముద్గల్లు
జమ్మలూరు
అమరాబాదు
నల్లగొండ
గోరువంకపల్లి
కూరెళ్ళ
అత్తిరాల
అద్దంకి
కురుములూరు
నలంప ఱువ
మొల్లకల్లూరు
దేవిగుడి
కానాల
పెనంపాడి
నతవాడి

— ० —

## కాయస్థ రాజుల, సామంతుల, సమకాలిక రాజుల, దండనాథాదుల పేర్లు -

గంగయసాహిణి, గణపతిదేవ మహారాజు, నామదేవ పండితుడు, ప్రోలరాజు, రుద్ర దెవుడు, మహాదేవరాజు వాయిపండితుడు, గోవిందజియ్య, ఎఱగజియ్య, గాన్గలాబోజు, కాడోజు, బాలిసెట్టిబాలమ, అల్లుగి, ఖండేరాయ, ఈశాంన్య గురుదేవర, జన్నిగదేవ మహారాజు, శాంత శివ దేశికులు, మెయిదేవరాజు, అన్ని పెద్ది, ఉత్తజియ మారజియ్య, మరయ, రుద్రదేవ మహారాజు (రుద్రమ దేవి), కరణం నామయ, మల్లపరాజు, లక్ష్మీదేవుడు, త్రిపురారిదేవుడు, నల్లెనారాయణస్వామి సాహణవ రాపేశ్వరభట్ల హెమ్మయ, వల్లభుడు, కోమటి పెడెమాడి సెట్టి కొడుకు అన్నెయ, ఇపకాత్తికదేవరె, బ్రమ్మరాజు అప్పన, సహస్ర నామాల పెరుమాడి, మండయ కొమ్మయ, కొమరగిరి దేవండు, వల్సినాయని కొమ్మనాయండు, బొల్పినాయుడు, అన్నమనాయని కొడుకు మల్లి నాయుండు, జోరమభట్లు, విశ్వనాథ భట్లు నిశ్శంక వీర బాల్నాయని మల్లికార్జునుడు, అంబదేవుడు, నందశివులు, రుద్రశివులు, కొమారగిరి దేవండు, మల్నాధుండు, వీరశివులు, మైలశివులు, సూదెరాశి త్రిపురాంతక శివులు బ్రహ్మ శివులు, భైరవ దేవండు, అంబయరెడ్డి, ఘొడెరాయ గంగదేవయ, ఖదేవుడు, కోయనాయుడు, ఉత్తమ శివ గురుదేవర, సిద్ధ శివులు, త్రిపురారిదేవుడు, సారంగు నాయకుడు, వెళారి మొదలి నాయని కొడుకు వంసంధరాయ, నాదేవ మహారాజు, చెవ్వరాజు, సిద్ధయ, అంబష్మాపతి, తిరుక్కాళత్తి దేవ మహారాజు, దామోదరుడు, సింఘణదేవ, లక్ష్మీదేవదండ నాయక, విజయగండ గోపాలుడు, జటావర్మ సుందర పాండ్యుడు, రక్కస గంగరాయదేవ మహారాజు, భీమదేవ చోడుడు, ఎద్దయదేవ చోడుడు, చింత రామ నాయకుడు, గంగదేవచోడుడు అల్లు గంగరాజు, స్వామిదేవ, కేశవదేవ, మనుమసిద్ధి, తిక్కన సోమయాజి, అనంతదేవుడు, తాళ్ళవల్లి దేవరాజు, నరేంద్రదేవుల మల్లినాథయ, శ్రీపతి గణపతి, ఏఱువ మల్లిదేవుడు, మల్లికార్జునుడు, మనుమబొల్ల, రాజరుద్రుడు, రాజన్న, మారవర్మ కులశేఖర పాండ్యుడు, బయ్యన, చిన్నయ, కంట్టులూరి గన్నయ, అన్నల దేవుడు, సోమయ పెద్దయసాహిణి, ప్రతాపరుద్రుడు, గోనవిరలుడు, సోమయనాయండు, కంపిలిరాయలు, మల్లారెడ్డి, ప్రోలయ వేమారెడ్డి, తాత పిన్నమ తిక్కన, బయ్యన, కాండి వాసుదేవ విప్రుడు, త్ర్యంబక శివాచార్యులు, ఇరుమది దేవుడు, గంగదేవుడు

## కాయస్థ స్త్రీల నామములు

గంగూబాయి, జండూబాయి, హాచలాంబ, కమలాబాయి, గౌరేశ్వరబాయి, గంగసాని, మారసాని, చందూబాయి అమ్మ, పదుమాబాయి

# శాసనములందు పేర్కొనబడిన అగ్రహారములు—భూములు

| క్రమ సంఖ్య | శాసనమున్న ప్రదేశము | దాత పేరు | దానమిచ్చిన సందర్భము | దానవివరము | దానమిచ్చిన కాలము | దానపరిగ్రహీత |
|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
| 1 | త్రిపురాంతకము | గంగయసాహిణి | కాకతి గణపతిదేవ మహారాజుకు గంగయసాహిణికి పుణ్యమగునట్లు మకరసంక్రాంతి పర్వదినమున | దువలికంపనములోని బోయపల్లిగ్రామము, రెడ్డపల్లి పొలము చతుస్సీమము | శకసంవత్సరము 1172 సాధారణ పుష్యశుద్ధ పంచమి గురువారము = క్రీ శ 1250 | మూలస్థాన దేవాలయ స్థానాపతులు |
| 2 | దుర్గి | గంగయసాహిణి మంత్రి శ్రీ కరణాధిపతి నామదేవ పండితుడు | వంకేశ్వర దేవర అంగరంగభోగి నివేద్యములకు | పల్లినాటిలోని నాగార్జునుని కోట తూర్పున గల నెయ్యూరి చెఱువు సహితముగా | శకవర్షము 1173 విరోధి అశ్వయుజ శుద్ధ 13 శుక్రవారము = క్రీ శ 1251 | దేవాలయస్థానాపతులు గోవిందజియ్య ఎఱగజియ్య కాడోజు |
| 3 | త్రిపురాంతకము | గంగయసాహిణి మంత్రి నామదేవ పండితుడు | త్రిపురాంతక మహాదేవరకు దేవనపర్వ నిమిత్తము | దువలికంపనము లోని కెంకులకుంట చతుస్సీమము | శకసంవత్సరము 1176 ఆనంద చైత్రశుద్ధ పౌర్ణమి శుక్రవారము = క్రీ శ 1254 | త్రిపురాంతకదేవర స్థానాపతి |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
|---|---|---|---|---|---|---|
| 4 | పుష్పగిరి | మోరటాధిపతి అల్లుగి తనయ హేచలాంబ, కాయస్థ గంగయ సాహిణి భార్య కమలాబాయి, పల్లవరాజు ఖండే రాయ | హేచలేశ్వర కామ లేశ్వర పల్ల వేశ్వ రుల ప్రతిష్ఠలు | — | శక సంవత్స రము 1176 ఆనంద మార్గశిర పంచమీ గురు వారము క్రీ శ 1254 | — |
| 5 | త్రిపురాంతకము | కాయస్థ గింగియ సాహిణి | త్రిపురాంతక మహాదేవర సంధ్యా కాలపు అంగరంగ భోగములకు | మెట్టవాడలోని పూలచఱ్ఱు గ్రామము చతు స్సీమ సకలాయ సహితము | శకవర్షము 1177 రాక్షస శ్రావణ శుద్ధ 15 మంగళవారము సోమ గ్రహణ పుణ్యకాలమందు క్రీ శ 1225 | త్రిపురాంకక స్థానాపతులు |
| 6 | గంగవరము | కాయస్థ గంగయ సాహిణి భార్య కమలాబాయి | పుష్పగిరి స్వామి అంగరంగ భోగ ములకు | ములికినాటి సీమ లోని గంగా పురము గ్రామము | శకవర్షము 1179 పింగళ శ్రావణ శుద్ధ 15 గురువారము క్రీ శ 1257 | ఈశాంస్య గురుస్థావళ్లి |
| 7 | పుష్పగిరి | కాయస్థ జన్నిగ దేవ మహారాజు | పుష్పగిరి ఇంద్రే శ్వర దేవర అంగ రంగ భోగములకు | తురుమడ్లపాడు గ్రామము | సిద్ధార్థి - వైశాఖ అక్ష తదియ | |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
|---|---|---|---|---|---|---|
| 8 | త్రిపురాంతకము | జన్నిగదేవుడు | త్రిపురాంతక దేవర అంగరంగ భోగములకు | వలనాటి సీమలోని గంద్ర కోట అనుంగురాజపల్లి చతుస్సీమము | శకవర్షము 1181 సాధారణ కార్తీక బహుళ అమావాస్య గురువారము = క్రీ శ 1259 | — |
| 9 | ఇటిగుల్లపాడు | జన్నిగదేవుడు | అభినవ గోళకీ మఠాధిపతి శాంత శివ దేశికులకు శివ లింగ మఠము, విద్యా మండపముల నిర్వహణకు, అతిథులకు భోజనాది వసతు లేర్పరచుటకు | సకిలి సీమలోని ముడుమల గ్రామము | — | — |
| 10 | పొందలూరు | జన్నిగదేవుడు | శాంత శివ దేశికులకు - శ్రీశైల మందలి విద్యా మండపము శివ లింగ మఠముల నిర్వహణకు అతిథుల భోజన వసతికి | అధి రాజేంద్రచోళ మండలము పొంనాటి పరిధి పొత్తపినాటిలోని పురుందలూరు గ్రామము | శక వర్షము 1182 రౌద్రి చైత్ర శుద్ధ 11 గురువారము = క్రీ శ 1260 | శాంత శివ దేశికులకు |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
|---|---|---|---|---|---|---|
| 11 | కారెంపూడి | జన్నిగదేవ మహా రాజు సర్వాధికారి మెయిదేవరాజు | సూరేశ్వర దేవర అంగరంగ భోగ ముల నిమిత్తము | నాగేశ్వరము తూర్పున రేవలు నిచ్చిన ప్రిత్తి ఖ4 | శ సం 1186 రక్తాక్షి మాఘ శుద్ధ 15 గురు వారము సోమ గ్రహణ నిమి త్తము = క్రీ శ 1264 | — |
| 12 | అట్లూరు | జన్నిగదేవ మహా రాజు | — | — | శ సం 1190 విభవ ఫాల్గుణ శుద్ధ 15 = క్రీ శ 1268 | — |
| 13 | దుర్గి | గంగాపుర అగ్ర హార ప్రముఖుడు సవదరమల్లపరాజు కొడుకు కరణము నామయ | గోపీనాథదేవర ప్రతిష్ఠకాలమందు దేవరఅంగరంగ భోగములకు వృత్తులు | వెలివొలము ఖ 4 గంగా సముద్రము ఉత్తరపు కొమ్మున మత్తులు, దక్షిణపు కొమ్మున చవుటనేల ఇతర వృత్తులు | శ సం 1191 శుక్ల జ్యేష్ట శుద్ధ 10 సోమవారము = క్రీ శ 1269 | — |
| 14 | త్రిపురాంతకము | త్రిపురారిదేవ మహారాజు | త్రిపురాంతకేశ్వ రునికి దానమిచ్చు నపుడు | మూడు పట్టాలు గంగావతారము పెద్దపూవు ఒయారము మినుంగుతోడి నూలు, మాల్యపూవు 2 పహిండి ఆకులు 2 గుంటకలు | శ సం 1194 అంగీరస అషాఢ శుద్ధ చతుర్దశి = క్రీ శ 1272 | — |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
|---|---|---|---|---|---|---|
| 15 | త్రిపురాంతకము | అంబదేవ మహా రాజు | త్రిపురాంతక దేవాలయ పూజారులకు దానమిచ్చు సందర్భమున | మెట్టవాడలోని చిన్న పులిచెఱువుల నడియూరు దానము – పెద్దింగారికి వృత్తి న 10 | శ స 1194 శ్రీముఖ జ్యేష్ఠ బహుళ అమావాస్య సోమవారము = క్రీ శ 1272 | త్రిపురాంతక దేవరకు మంత్రపుష్పము పెట్టు పూజారులు – నంద శివులు, కొమార శివులు, రుద్రశివులు, సూదేరాశి త్రిపురాంతక శివులు, కొమార గిరిదేవండు, మల్నాధండు, బ్రహ్మశివులు, భైరవ దేవండు, వీర శివులు, మైలశివులు, గంగసాని, త్రిపురాంతక శివులు |
| 16 | అక్కలరెడ్డి పల్లి కొండపై గల మల్లికార్జు నాలయము ముందున్న శిల | గౌరేశ్వరబాయి | త్రిపురాది దేవ మహారాజు పుణ్యార్థము శివాలయ నిర్మాణము | శివాలయ నిర్మాణము వృత్తులు ఆ చంద్రార్కముగ పెట్టినది | శ క సం 1205 స్వభాను వైశాఖ శుద్ధ సప్తమీ సోమవారము = క్రీ శ 15-4-1283 | |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
|---|---|---|---|---|---|---|
| 17 | త్రిపురాంతకము | సవదర అంబయ రెడ్డి | అంబదేవ మహా రాజులు ఎఱ్ఱ చెల్లించుకొన్న నాండు సవదర నలం పటువు ప్రభు ముఖ్యులు అంబయ రెడ్డి తలిదండ్రుల పుణ్యార్థము త్రిపు రాంతక దేవుని అఖండ దీపము నకు దానము | అఖండ దీపము నకు 50 మొదవులు 1 ఆబోతు ఒక సలగ ఎద్దు | శ సం 1210 సర్వధారి పుష్య శుద్ధ పాడ్యమి ఆదివారము = క్రి శ 1288 | — |
| 18 | త్రిపురాంతకము | అంబదేవ మహా రాజు | అంబదేవ మహా రాజు త్రిపురాంత కేశ్వరుని ప్రాతః సంధ్య మధ్యాహ్న సంధ్యల నడుమ తమ పేర అవ సరము కల్పించు సందర్భమున | ప్రాతః సంధ్య మధ్యాహ్న సంధ్య నడుమ అవ సరము-త్రిపురాం తక దేవుని పూజాదికములకు దానము | శ సం 1212 వికృతి భాద్రపద బహుళ అమా వాస్య మంగళ వారము సూర్య గ్రహణ కాలము = క్రి శ 1290 | — |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
| --- | --- | --- | --- | --- | --- | --- |
| 19 | త్రిపురాంత ము | అంబదేవమహారాజు | త్రిపురాంతకేశ్వరుని పూర్వాగ్రహారము లను పునర్దత్త మొనర్చుట | అంబదేవమహారాజు త్రిపురాంతక మహా దేవుని అగ్రహార ములను గ్రామము లను పునరుద్ధరిం చుచు వేయించిన శాసనము | శ సం 1212 వికృతి భాద్రపద బహుళ అమావాస్య మంగళవారము సూర్యగ్రహణ కాలము = క్రి శ 1290 | నందశివులు గంగాపురాగ్ర హారము పొందుట |
| 20 | బ్రాహ్మణపల్లి | అంబదేవమహారాజు ప్రధాని గురువు ఘోడేరాయ గంగ దేవయ | గ్రామ సరిహద్దు రాళ్ళ నేర్పాటు చేయుట | రావులకొలను బొట్టేరు శివపురము సరిహద్దు రాళ్ళ నేర్పరచుట | శ సం 1212 వికృతి భాద్రపద శుద్ధ పంచమి గురువారము = క్రి శ 1290 | |
| 21 | త్రిపురాంతకము | అంబదేవమహారాజు | త్రిపురాంతకేశ్వరు నికి దానమిచ్చు సందర్భము | అసంపూర్తి శాసనము | శ సం 1213 = క్రి శ 1291 | |
| 22 | త్రిపురాంతకము | ఖదేవుడు | పవిత్రారోపణ పుణ్యకాలమున అంబదేవ మహా రాజునకు పుణ్య ముగా త్రిపురాంతక దేవునికి కానుక నిచ్చునపుడు | త్రిపురాంత కేశ్వ రునికి నవరత్నా భరణముల సమర్పణ | శ సం 1213 ఖర నిజాషాఢ శుద్ధ 15 బుధ వారము = క్రి శ 1291 | |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
|---|---|---|---|---|---|---|
| 23 | రాజంపేట | అంబదేవ మహారాజు | ఉత్తమ శివగురు దేవుని తనయుడు సిద్ధేశ్వరుని కగ్రహార మిచ్చునపుడు | గుంజనాగేశ్వరము కాలుకుంట తదితర గ్రామములను సిద్ధేశ్వరునికి దాన మిచ్చుట | శ సం 1214 నందన జ్యేష్ఠ శుద్ధ పాడ్యమి = క్రీ శ 1292 | ఉత్తమ శివగురు దేవుని తనయుడు సిద్ధేశ్వరుడు |
| 24 | వరికుంట | అంబదేవ మహారాజు తనయుడు త్రిపురారి దేవుడు | సిద్ధనాథదేవం అంగరంగ భోగములకు దానము | సిద్ధనాధదేవరకు సకిలి భూమిలోని వరికుంట గ్రామము సాద, సుండన, శాస్త్య సర్వమాన్యముగా | శ సం 1226 క్రోధి చైత్ర శుద్ధ సప్తమి గురువారము = క్రీ శ 1304 | |
| 25 | లేబాక చెన్నకేశవాలయము | త్రిపురారి దేవ మహారాజు | అసంపూర్తి | అసంపూర్తి | శ సం 1226 క్రోధి వైశాఖ శుద్ధ పంచమి గురువారము = క్రీ శ 1304 | |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
|---|---|---|---|---|---|---|
| 26 | అత్తిరాల పరశు రామేశ్వ రాలయము | అంబదేవమహారాజు సామంతుడు నిదేవ మహారాజు | పరశురామేశ్వరదేవ రకు దానమిచ్చు సందర్భము | అఱుతురేవులగ్రామము రేబాకలో అంత్రి గంగ్గనరాయ సహస్రమల్లుకాలువ తాడ్లపాక, గండ పెండార కాలువ ఊటుకూరులో అంబ సముద్రము అంబాపుర నిర్మాణము శివపురము | శ సం 1201 ప్రమోదూత పుష్య బహుళ పంచమి శుక్రవారము మకరసంక్రాంతి = క్రీ శ 1279 | శాసన రచయిత కడొకిలి కరణము చెర్వరాజు కొడుకు సిద్ధయ |
| 27 | పోలి వరదరాజేశ్వ రాలయము | అంబదేవమహారాజు | పూర్వాగ్రహార పునరుద్ధరణ | అసంపూర్తి శాసనము | శ సం 1212 చైత్ర శుద్ధ పాడ్యమి = క్రీ శ 1290 | |

— ೦ —

# కాయస్థరాజుల శాసనములు

## 1. గంగయ సాహిణి త్రిపురాంతక శాసనము

త్రిపురాంతకములోని మూల బ్రహ్మేశ్వరాలయ ముఖమండపమునందీ శాసనశిల అమర్చ బడియున్నది ఈ ఆలయము కుమారగిరి పాదము చెంతనున్న సోపానములనంటి యున్నది శాసనము 31 పంక్తులలో చెక్కబడినది

కాయస్థ గంగయ సాహిణి బిరుదములిందు వర్ణింపబడినవి కాకతి గణపతిదేవ మహా రాజులకు, తనకు, ధర్మమగునట్లు దువలి కంపనములోని బోయపల్లి గ్రామమును, రెడ్లపల్లి పొలము చతుస్సీమలును, గంగయ సాహిణి త్రిపురాంతకములోని మూల స్థాన దేవర అంగరంగ భోగములకు సకలాయ సహితముగా దానమిచ్చు సందర్భమునందీ శాసనమును వేయించెను

శాసనమున 20 వ పంక్తి నుండి 26 వ పంక్తి వరకు వ్యాస గీతా శ్లోకములున్నవి తరువాత దానమునకు విఘ్నము గావించిన వారికి కలుగు పాప ఫలము తెలుపబడినది

ఈ శాసనము సాధారణ సంవత్సర పుష్య శుద్ధ పంచమీ గురువారము మకర సంక్రమణ పుణ్య దినమునా డీయబడినది ఇందు పేర్కొనబడిన శక సంవత్సరము 1175, 1172 కు బదులుగా వ్రాయబడినది సాధారణ సంవత్సరము శక సంవత్సరము 1172 లో వచ్చినది కావున శాసనకాలము క్రీ శ 1250

### శాసనము - మూలము

1 స్వస్తిశ్రీమన్మహామండలేశ్వర బాహత్తరినియో
2 గాధిపతి అనేక దేశాధిపతి చాతుర్వర్ణ్ణ సముద్ధర
3 పశ్చిమరాయ దామోదర సైన్యదిశాపట్ట ఏకాంగ
4 వీర వీరావతార అతి విషమహయారూఢ ప్రౌఢరే
5 ఖారేవంత విజయలక్ష్మీకాంత నాయక నారాయ
6 ణ కదన ప్రచండ మన్నియ బెంటకార గణపతిదేవ

7 దివ్య శ్రీ పాదపద్మారాధకదోస్తంభ స్తంభిత సకలక్షి
8 తిపాలకౌర్య్యాక్ష యశ స్తోమతిలకతటి - ౦గనాము
9 ఖ వితరణ గుణ వినిర్జిత కామధేను కల్పద్రుమ
10 - డియ - య దిశాపట్ట మూరురాయ జగదళ బరబల
11 నామాది సమస్త ప్రశస్తి సహితం శ్రీ మన్మహామం
12 డలేశ్వర గండపెండారు గంగయసాహిణి స్వస్తిశ్రీ
13 శక వరుషంబులు 1175 (1172) అగు నేంటి సాధారణ సంవ
14 త్సర పుష్య శు॥ 5 గు॥ నాటి మకర సంక్రాంతి పుణ్య
15 కాలమందు శ్రీ త్రిపురాంతకము శ్రీ మూలస్థాన
16 దేవర అంగరంగ భోగాలకు గణపతిదేవ మహారాజు
17 లకు తమకు ధర్మ్మకావుగాను దువలి కంపనము -
18 - లోయలపల్లిని రెడ్లపల్లి పొలమూను చతుస్సీమ
19 మూను ఎకలాయ సహితముగా ధారాపూర్వ్వకం
20 సేసి ఇచ్చెను॥ సామాన్యోయంధర్మ్మ సేతుం నృపానాం
21 కాలే కాలే పాలనీయోభవద్భిః సర్వ్వా
22 నేతాన్భావినః పార్త్థివేంద్రాన్ భూయో
23 భూయో యాచతే రామభద్రః॥ స్వ
24 దత్తా ద్విగుణం పుణ్యం పరదత్తాను
25 పాలనం పరదత్తాపహారేణ
26 స్వదత్తం నిష్ఫలంభవేత్॥ ఇధర్మ్మకావునకు ఎవరేని
27 లంఘనము తలంచినవారు గంగా తీరమందు తన పెద్ద
28 కొడుకు కపాలము పట్టుకొని శత్రు గ్రిహమునకు
29 భిక్షానకుంబోయితేను చీంపుబు కట్టి నాటు పడి
30 పది వేల కపిల గోవుల వధియించిన మహా పా
31 తకానం బడంగలవారు॥ మంగళ మహా శ్రీ శ్రీ

# 2. నామదేవ పండితుని దుర్గి శాసనము

గుంటూరు జిల్లా పలనాడు తాలూకాలోని దుర్గి గ్రామమందున్న వంకేశ్వరాలయమం దమర్చబడిన శిలాఫలకముపై రెండు ప్రక్కల చెక్కబడియున్న ఈ శాసనమును శక సంవత్సరము 1173 విరోధికృతు ఆశ్వయుజ శుద్ధ 13 శుక్రవారమునాడు, క్రిష్ణవేణీ సమీప నాగార్జునుని కోటకు తూర్పునగల నెయ్యూరి చెఱువు సహితముగా ఆచంద్రాక్కార్కస్థాయిగా శ్రీ వంకేశ్వరదేవర అంగరంగ భోగములకు కాయస్థ గంగయ సాహిణి మహామాత్యుడగు నామదేవ పండితుడు దాన మిచ్చునపుడు వేయించెను

శాసనము మొదటిప్రక్క 52 పంక్తులలో సంస్కృతభాషలోను, రెండవప్రక్క 64 పంక్తులలో తెలుగుభాషలోను ఉన్నది రెండవప్రక్క 55వ పంక్తినుండి 8 వ్యాసగీతా శ్లోకములున్నవి సంస్కృత శాసన భాగము 20 శ్లోకములతో కూడియున్నది

శాసనమున కాకతి రెండవ ప్రోలరాజు, రుద్రదేవుడు, మహాదేవరాజు, గణపతిదేవ మహారాజు వర్ణింపబడినారు కాయస్థ గంగయ సాహిణి, అతని మహామంత్రి నామదేవ పండితుడు ప్రశంసింపబడిన పిదప, నామదేవ పండితుని తలిదండ్రుల విషయము తెలుపబడినది

నామదేవ పండితుడు గంగయసాహిణి పానుంగల్లు మొదలు మార్జవాడి దాంకా సుఖసంకథా వినోదంబులం రాజ్యంబు సేయుచుండంగాం తత్పాద పద్మోపజీవియున్సకల రాజ్య సముద్ధరుండును, శ్రీ కరణాధిపతియునుం గాయస్థకుల వార్ధి వర్ద్ధన సుధాకరుండు అని వర్ణింపబడినాడు

ఇతడు పలనాటిలోని దుగ్య పట్టణమున తన తండ్రి హాయి పండితుని పేర వంకేశ్వరుని ప్రతిష్ఠ చేసెను కాకతి గణపతిదేవ మహారాజు దుగ్య పట్టణము వచ్చినపు డాతని దయను పొంది మూరురాయ జగదాళ పడగాను చలమెత్తు గండ బిరుదమును పొంది, గణపతి దయవలన వంకేశ్వరుని ప్రతిష్ఠ గావించితినని విన్నవించెను గణపతిదేవ మహారాజు వంకేశ్వరునికి నమస్కరించి నెయ్యూరి చెఱువు సహితముగా, అష్ట భోగ తేజ సహితముగా ధారాపూర్వకముగా ఆచంద్రార్క స్థాయిగా దాన మిచ్చెను

తరువాత శాసన భాగము వంకేశ్వరుని అంగరంగ భోగములకు ధూపదీప నైవేద్యములకు, పూజారులకు, పరిచారకులకు, తదితరులకు దానమిచ్చిన విషయమును తెలుపుచున్నది

తెలుగు శాసన భాగమున ౬౬ వ పంక్తి నుండి శాసనాంతమువరకు వ్యాస గీతా శ్లోకము లున్నవి శాసన కాలము క్రీ శ 1251

## శాసనము - మూలము

### మొదటి ప్రక్క

1 ఓం శ్రేయస్తే విజయాం కరోతు సతతం విష్ణుర్వ్వరాహంహ్యాయశ్చత్రీయ
2 త్యథ భూగ్గ్రహీయతీవయద్దంష్ట్రా ముఖేధీయతే। ప్రస్ఫష్టామలమౌక్తి
3 కీయ తీతరాంయద్రోమ కూపేంబుధిర్ల్లోకానామమృతీయతి ప్ర
4 తిపదం చానంద కందీయతి (1) బ్రహ్మా ససర్జ జగతాంత్రితయం ప్ర
5 కృష్టం రాజ్ఞాంకులాని నిఖిలాని జయాస్పదాని। యేషాంయశో
6 విశద మిందు నిభం మహద్భూలోకేస్థిర ప్రథిత కాకెతసం
7 జ్ఞకంచ (2) తస్మిన్కులే పాలయితా ప్రజానాం ప్రోలక్షితీశోల
8 భతాత్మలాభం। ఆజ్ఞాయదీయారిపు శేఖరాగ్ర మణి ప్రభా సఖ్య
9 మవాప నిత్యం (3) ఆసీత్సుత స్తస్య భువోధభర్తా శ్రీ రుద్ర
10 దేవః ప్రథిత ప్రతాపః। యత్ఖడ్గమాస్తారి వధస్సురేంద్రా స్సం
11 తోష్యమన్యంత య మేవమిష్టం (4) తస్యానుజో భూన్మహాదే
12 వరాజః పృథ్వీ ప్రశాస్తా ప్రథనీయకీర్తిః। యత్పాదయుగ్మస్య
13 నఖప్రభాభిస్సంధింకరోతి ప్రతిపక్ష మూర్ధ్నా (5) అస్తి ప్రశస్తి
14 సహితః క్షితిపాలకానాం చూడామణి గ్గుణవతిమ్మహా
15 దేవసూనుః। ప్రౌఢస్వశౌర్య్య పరిచిత నృపాళిషేకే స్వాచార్య్య
16 కః ప్రకటినృపోన్మదమర్దనోత్కః (6) యస్మి న్నాసతి మేదినీతలపురీ
17 మంటోధి ఖాతాంకితా మాజ్ఞాదుగ మనోరమాం క్షితిప
18 తిప్రోత్తుంగ సత్తోరణాం। ధర్మ్మో వృద్ధిమవాప్నుయా ద్విజవ
19 రాస్సర్వ్వత్ర సంవర్ధితా స్సద్భక్తిగ్గు రుషుస్ఫుటాసమభవద్బాస్త్రే
20 షధీస్సుస్థిరా (7) దద్దక్షిణోబాహు రయంక్షతీశః శ్రీగ
21 ంధపెంకారమురారిముద్రః। గంగాధిపోస్తి ప్రతినాయకే భ
22 భిదే ససంహ్వః క్షితిపాలనాయ (8) యద్ధాటీతురగావలీ పృ
23 థుఖురక్షుణ్ణోత్థిత క్ష్మారజః ప్రచ్ఛన్నాః ప్రవిలోక్యతా దశదిశో భీ

24 తావదంతిస్ఫుటం। దైవ జ్ఞావయ మాదితా పసగణా స్సద్రాబ్రహ్మా
25 ణాశ్యాంభవా స్పష్టంకప్పర్టి కావయం వయ మహా నక్షత్రియాః
26 పార్థివాః (9) ఆస్తికశ్యపం సంభూతః కాయస్థకుల వారిధిః। కలాక
27 లాప కల్లోల ప్రరూఢ గుణ మౌక్తికః (10) శ్రీవల్లు రక్కసో
28 నామతస్మన్నాతో చంద్రమాః। ఆత్మీయ జనతానందకుము
29 దానాం వికాసకః (11) — మ్మహనీయ కీర్తిః
30 శ్రీ వాయి పండితఇతి ప్రథితః పృథివ్యాం। తస్యాభవత్రియత
31 మార మణియ్యమూర్తిర్గంగేవ శంకరరతా భువి గంగుణా
32 యీ (12) తత్పుత్రో గుణ కోమలాం కురతయా ప్రోద్యద్భశః
33 పుష్పకైః పాత్రో దారసుదాన పూరిత ఫలై ర్బంధు స్ఫురత్త
34 ట్పదైః। కాయ స్థాన్వయ దుగ్ధ సాగర మరుద్వ్యక్తోస్తి లక్ష్మీనిధిః శ్రీ మద్గం
35 గయ మండలీక సచివ శ్రీ నామదేవ ప్రభుః (13) యద్బుద్ధిర్బుధ
36 సంఘధారణ వరాధాత్రా విదేధీయతే యద్రూపం నిఖిల ద్విజో
37 మముదాం స్థానంచ వావచ్యతే య ద్దైర్యం పృథుభూమి ధారణ జ
38 యత్కార్మ్మణతోమ్మాయతే యత్కీర్తిర్దశ దిగ్వధూముఖల సత్పద్మే
39 విజేజీయతే (14) తేన ప్రకృష్ట స్వైత్ప ప్రభక్త్యా తన్నామధేయం భవనం శివ
40 స్య ప్రాకారి దుర్గాం - స్మిన్వంకేశ్వరోయం ప్రథితః పృథివ్యాం।
41 (15) గణపక్షితీశాదుపలభ్య చిహ్నం లలితం సమాదాయ తతోర్వ
42 జాఖ్యం సకృత ప్రసాదః ప్రభు నామయస్య ప్రణతోథ వంకేశ్వరసౌఖ్య
43 కాయః (16) స్వస్తిశ్రీ మచ్ఛకాబ్దే గుణ గిరి గిరిశే వత్సరేస్మి న్విరోధ కృత్యాం
44 శ్విన్యాద్యమాసే సితరతిపతిథౌ కావ్య వారే ప్రకృష్టే। పుష్యత్సస్యాంధ్ర దేశా
45 దికళు భవిల సత్పల్లి నాంటౌ ప్రసిద్ధే ఎయ్యూరి గ్రామ వయోర్మహిష ప
46 తిదిశః కృష్ణవేణీ తటిన్యాః। (17) నాగార్జున్నాఖ్యస్యను సాధకస్య ప్రాకా
47 రదేశాత్పురత స్థితంచ। పుష్యత్సు నీరం బహువృక్షయుక్తం శ్రీ పు
48 ష్ప వాటిం సహ ఖల్కదండం (18) గంగాధిపః ప్రీతమ నాస్సురా ప్రాదా
49 ద్య థావత్సహితోను వగ్రైః। ఆసూర్య్య మాచంద్రమభీష్ట భాస్యద్రంగా
50 గభోగార్థమమేయ కీర్తిః (19) వంకేశ్వరోయం సతతం కరోతుశ్రీ
51 నామదేవస్య మనోరమాణి। యస్యాం త్రి యుగ్మం సకలామునీ।
52 ంద్రా ధ్యాయంతి యోగేన హితార్థసిద్ధ్యై (20)

## రెండవ ప్రక్క

1 స్వస్తి సమధిగత పంచమహాశబ్ద మహామండలేశ్వరపతి హి
2 త చరిత వినయవిభూషణశ్రీ యనుమకొండ పురవరాధీశ్వరులైన శ్రీమన్మహా
3 మండశేశ్వర కాకతియ్య గణపతిదేవ మహారాజులు ఒరుంగల్లు నిజరాజ
4 ధానిగా సుఖసంకథా వినోదంబులం బ్రిథివిరాజ్యంబు సేయుచుండంగా
5 ం దత్పాద పద్మోప జీవియైన శ్రీ మ(త్)గండపెండార గంగయ్య సాహిణి పానుం
6 ల్లు మొదలుగా మార్జ్జవాడిదాంకా సుఖ సంకథా వినోదంబులం రాజ్యంబు సే
7 యుచుండంగాం దత్పాద పద్మోప జీవియు న్సకల రాజ్య సముద్ధరుండును శ్రీ
8 కరణాధిపతియునుం గాయస్థకుల వార్ద్ధి వర్ద్ధనసుధాకరుండునునైన శ్రీ నా
9 మ దేవ పండితులు పల్లినాంటిలోని దుగ్య పట్టణమునందుదమ తండ్రి వాయి
10 పండితుల పేరను పంకేశ్వర దేవరం బ్రతిష్ఠ సేసి గణపతిదేవ మహారాజుం
11 గానిచి కారుణ్యము వడసి మూఱురాయ జగదాళ పడగాను చలమెత్తు గండ
12 బిరుదూం దెచ్చిన సకల సన్నాహమూ మెఱసి ఎదురువచ్చి కానిపించుకొని పడగా
13 బిరుదూ నిచ్చినం జేకొని సంతోషించియున్న యవసరంబున దేవర కారుణ్యము
14 న దుగ్యను పంకేశ్వర దేవరం బ్రతిష్ఠ సేస్తినని విన్నపము సేసినను ఆ దేవరకు నమస్క
15 రించి స్వస్తి శ్రీ శకవర్షంబులు 1178 యగు నేంటి విరోధి కృత్సంవత్సర ఆశ్వయు
16 జ శుద్ధ 13 శుక్రవారము నాండు పంకేశ్వర దేవర కంగరంగ భోగ నైవేద్యములకు
17 ం గ్రిష్ణవేణి సమీపంబున నాగార్జ్జునికోట తూర్పున నెయ్యూరి చెఱ్వు సహితముగా
18 ను అష్టభోగ తేజ సహితముగా ధారాపూర్వ్వకంబుసేసి ఆ చంద్రార్క్క స్థాయిగా
19 నిచ్చె। ఆయూరి పొలమేరలు తూర్పునతాల పొంతటి మింది గుట్ట। తూర్పు ఆగ్నే
20 యము నడుమాను జాం పొంతటి మీది గుట్ట। ఆగ్నేయమునా తాల పొంతటి మిందిగు
21 ట్ట। ఆగ్నేయము దక్షిణము నడ్మాను తాల పొంతటిగుట్ట। దక్షిణాన నేలేశ్వరం తెరువు
22 న। తాల పొంతటిగుట్ట। మఱి దక్షిణానం గూంకట గుబ్బలి కూంకటి దక్షిణాన
23 నల్లసేల దక్షిణము నైరుతి పడ్మను మిడ్డనేల। నైరుతి నిం గల్లుం గుట్ట। నైరుతి పడ్మటి నడ్మ
24 ం గాకిజాలూ నరువుకుఱ్వమ। పడ్మటను నాగార్జ్జుని కోటలో నారిగట్టు। పడ్మటి వాయ
25 వ్యమ నడ్మం బెదాంకఱ్వ। వాయవ్యమున దరిసవాం గు। వాయవ్యము ఉత్తరము న
26 డ్మను తాల పొంతటిగట్ట। ఉత్తరాన నెఱ్ఱుంబుట్ట। ఉత్తరము ఈశాన్యము నడుమను దంతిచె
27 ట్టు తాలగుట్ట। ఈశాన్యమున వాంగు తూర్పున తాలపొంతటి మిందిగుట్ట। ఈశాన్య
28 ము తూర్పునడ్మను తాలపొంతటి మిందిగుట। పూర్వ్వాచితులు ...

29 రకూ బ్రాహ్మలకూ వెలివొలం ఖ 5 ॥ నీర్నేల వ ౹౹ ౧ మహాదేవి చెఱ్లం జండు బా

30 ౨ు యిచ్చినది పెద్దచెఱ్వెనక మ 1 వెలివొలము తాడ్లపల్లి తెరువున ఖ 1 వెలిదొఱ్లు

31 ను ఊరి ముందటి చెఱ్వెనక మ 1 వెలివొలము ఖ 1 దేవరకిచ్చిన గంగులు 40 ఇంత్త

32 వట్టు వంకేశ్వరదేవరకూ నాగేశ్వరదేవరకూ । పాగేశ్వరదేవరకూ నంగరంగభోగ నైవేద్యము

33 --నడుపువాండు ఈ స్థలము మింద । వంకేశ్వరదేవరకూం బరివార

34 దేవతలకూ మధ్యాహ్నపు మావటి ఓవిరం బియ్యం—నాగేశ్వరదేవరకు ఇరుప్రొద్దటి ఓవిరం

35 బియ్యం — పాగేశ్వరదేవరకు ఇరుప్రొద్దటి ఓవిరం బియ్యం-ఈ ఓవిరాల వప్పునకుం బెసలు

36 మా 3 ఈ ఓవిరాలకు నేయి సోలలు 3 వంకేశ్వరదేవరకు అఖండము నేతిదీవం 1 అఖండం నూనె

37 దీపాలు 3 నాగేశ్వరదెవరకు అఖండం నూనెదీవం 1 సంధ్యాకాలమన్నిటికి పరివారదేవతలకూ

38 దీవ మెత్తేది । శ్రీగంధ మెండాటికి గ 3 గుగ్గిలం గ 3 విడెం పోంకలు అన్నిదేవర్లకూ నిత్య 28 ఆ

39 కులు 16 పంచ పర్వాలు 5 కి దేవర విభవ వెచ్చంగ 7 సేసేది । చాతుర్మాస్య । నెలలు 4 న్ను నిత్యేయే

40 వురపాస్ప । తులకు భోజనం లెస్సంగాం బెట్టేది । ఇంతవట్టు దేవరకు అంగ భోగము । రంగ భోగము

41 మద్దెలల వారు 3 అవజకాండు 1 పాత్రలు సింహ్యా నేత్రలు - మొఖరి 1,

42 ఇంతవట్టు విద్యామంతుల జీత గ - 7 - కరణము —

43 — జీత గ 7 — దారతాడ్ల ఒడ్డవేముల పోరం బూవుం

44 తోంట పూవులు పూజకు నడపెడిది । ఆతోంటనే ఓవిరానకుం గూరగాయలు నడపె

45 డిది ఇంతపట్టు — ఆచంద్రాకర్కం నడుపువాండు । దేవర భ

46 ం డారువు గండ పెట్టెడి వాండు దానె । ఈ దేవస్థానము వారు గోవింద జియ్యాను ఎఱగజి

47 య్యాను । వీరి కుటుంబానకు దుగ్యను వెలివొలము ఖ 24 నీర్నేల గంగా సముద్రం వెన

48 కను వ॥ రేవినాయ్ని చెఱ్వెనక వ॥ కామరాజు చెఱ్వెనక అడుకట్టు వ॥ ఆ చెఱ్వెనకనె పా

49 గేశ్వర దేవర దివ। దుగ్యకాంపుం గొడుకులు దేవరకు నిచ్చిన విప్పద్వి పాళికలూను ఆవి

50 న కొల్చునకు దేవర సుంకము గద్యాణానకు। పోంకలు 5 ఆకుంబెఱ్కను ఆకులు 100 ఇం

51 తవట్టువారు భోగించి దేవ పూజలు త్రిసంధ్యలార జేయువారు। గాన్గలాబోజు గానుగు దేవర

52 దీపాల నూనె నడపు వాండు సుంకం మాన్యం। ఇంతపట్టు ధర్మ్మవు పల్లినాండు ఎవ్వరేని ఏలె

53 డి వారు ఈ స్థానమునకు అంగరంగ భోగాలకిచ్చినంత వట్టు నడిపి ప్రిథివి రాజ్యము సేయువా

54. రు। నడపిన ధర్మ్మానకు పునం బొందువారు । ఈ దేవర గుడివని చేసిన కాడోజునకు దుగ్యాను
ప్రవృత్తి న 10 నీర్నేలను......

55. బహుభిర్వ్వసుధా దత్తా రాజభిస్సగరాదిభిః । యస్య యస్య యదా భూమి స్తస్య తస్య తదా
ఫలం॥ (1)

56. సామాన్యోయం ధర్మ్మసేతు నృపాణాం కాలేకాలే పాలనీయోభవద్భిః । సర్వ్వా నేతా
న్భావినః పార్థివే

57. ంద్రాన్భూయోభూయోయాచతే రామచంద్రః (2) స్వదత్తా ద్విగుణం పుణ్యం వరదత్తానుపా

58. లనం 1 పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ (3) శత్రుణోపికృతో ధర్మ్మః పాల
నియ్యః ప్రయ

59. త్నతః । శత్రురేవహి శత్రుస్స్యాద్ధర్మ్మ శ్శత్రున్న కస్యచిత్ (4) మద్వంశజాః పరమహీపతి
వంశజావా పాపా

60. దపేత మనసోభువిభావిభూపాః । యేపాలయంతి మమధర్మ్మ మిమం సమస్తం తేషాం మ

61. యా విరచితోంజలి రేషమూర్ద్ని (5) యదాచంద్రమసోవృద్ధి రహన్యహనిజాయతే । ఏవంభూ

62. మికృతం దానం సస్యే సస్యేవివర్ధతే (6) దానపాలనయోర్మ్మధ్యేదానాచ్ఛ్రేయోనుపాలనం
దానాత్స్వర్గ

63. మవాప్నోతి పాలనాదచ్యుతంపదం (7) దేవద్రవ్యంతిలార్ధార్ధమర్ధం భక్షంతియేనరాః । శ్వా

64. నయోనిశతంగత్వా చండాలేష్వభిజాయతే (8)

—: o :—

# 3 నామదేవ పండితుని త్రిపురాంతక శాసనము

త్రిపురాంతకములోని చింటి మిద్దె ప్రాక్కుడ్యముపై 10 పంక్తులలో చెక్కబడియున్న శాసనమిది

శకసంవత్సరము 1176 ఆనంద, చైత్ర శుద్ధ పౌర్ణమి శుక్రవారమునాడు కాయస్థ గంగయ సాహిణి, మంత్రియైన నామదేవ పండితుడు దేవన వర్మ నిమిత్తమున త్రిపురాంతక మహాదేవునికి, దువ్వ కంపనములోని కెంగులకుంట చతుస్సీమను ఆచంద్రార్కస్థాయిగా దానమిచ్చు సందర్భరము నందీ శాసనమును వేయించెను

ఈ శాసనమున గంగయ సాహిణి వర్ణింపబడినాడు శాసనారంభమున కాకతి గణపతి దేవుని ప్రశంసయున్నది

నామదేవ పండితుడు గంగయ సాహిణి మంత్రి అతడు "సమస్త రాజ్యభార నిరూపిత మహామాత్య పదవీ విరాజమానమానోన్నత ప్రభు మంత్రోత్సాహ శక్తిత్రయగుణసంపన్న ఆనయాసన ద్వైధీభావ శాడ్గుణ్య గుణోపేత పరేంగిత జ్ఞాన అష్టావధారణా ధౌర్య్య భరిత ఉత్పంన్నమతి సంపన్న సురగురు సమాన సకళశాస్త్ర పారవారక మంత్రి మాణిక్య నీతి చాణక్య పతికార్య్య ధురంధర పరివార కల్పలతా పూజ్య దీనార్తి జన సువర్న్న ధారానటనదభీరయు - దీనానాంధగయక వైతాళిక వైభాసిక దండి ముండి సిఖండి నానాపేక్ష షోడశ ఆదక దరిద్ర ఖండన నిత్య నేమానుష్టాన వాశిష్ట పురోగమనులైన నామదేవ పండితులు అని వర్ణింపబడినాడు వ్యాసగీతా శ్లోకము తరువాత నామదేవ పంటితుడు త్రిపురాంతక మహాదేవర అఖండ దీవమునకు 40 మొదవులు బాలిసెట్టిబాలమ కొసంగి అతడు వంశపారంపర్యముగా నిత్యము మానేడు నేతిని పోయునట్లు కట్టడి చేసెను

శాసనకాలము క్రీ శ 1254

## శాసనము - మూలము

స్వస్తి సమస్త ప్రసస్తిసహితం శ్రీమన్మహామండలేశ్వరం కాకతియ్య గణపతిదేవ మహారాజులు, ఓరుగల్లు రాజధానిగాను సుఖసంకథా వినోదంబుల రాజ్యంబు

2 సేయుచుండగాను తత్పాద పద్మారాధకుండయిన స్వస్తి యనేక నామావళి విరాజమానమానోం
న్నత అతి విషమహయారూఢ ప్రౌఢరేఖా రేవంత విజయలక్ష్మి కాంత దనదిగుభరిత కీర్తి
కామినీ వల్లభ

3 భయలోభదుర్లభ పశ్చిమరాయ దామోదర సైన్యదిశాపట్ట వైరిఘరట్ట రం...సగంగరసదిశా
పట్ట మూర్ఖరాయ జగద్దళ గణపతిదేవ దివ్య శ్రీపాద పద్మారాధక పరిబళ సాధక నామాది
సమస్త ప్రస

4 స్తి సహితం శ్రీ మన్మహామండళిక అరివీర బ్రహ్మరాక్షస నాయకి నారాయణ గండపెండారు
గంగయ్య సాహిణి సమస్త రాజ్య సముద్ధరుండైన స్వస్తి సమస్త రాజ్యభార నిరూపిత మహా
మాత్య పదవీ రాజమా

5 నమానోంన్నత ప్రభుమంత్రోత్సాహ శక్తిత్రయగుణసంపన్న అనయాసన ద్వైధీభావ
శాడ్గుణ్యగణోపేత పరేంగిత జ్ఞాన అష్టావధారణా ధౌర్యభరిత ఉత్పన్నమతి సంపన్న సుర
గురు సమాన సకళ శాస్త్రపా

6 రావారక మంత్రి మాణిక్య నీతి చాణక్య పతికార్య ధురంధర పరివార కల్పలతా పూజ్య
దీనార్తి జన సువర్ణ ధారానట నగభీరయు - దీనానాంధ గాయక వైతాళిక వైఖాసిక
దండి, ముండి సిఖం

7 డి నానాపేక్ష శోడళ ఆదక దరిద్ర ఖండన నిత్య నేమానుష్టాన వాశిష్ట పురోగమనులైన నామ
దేవ పండితులు స్వస్తిశ్రీ సకవర్షంబులు 1176 నేంటి ఆనంద సంవత్సరమున చైత్ర శుద్ధ
15 శు । నాడు దేవ

8 న పర్వ నిమిత్యమున శ్రీ త్రిపురాంతక శ్రీమనుమహా దేవరకు దువ్వ - కంపనలోని కెంకు
కుంట చతుస్సీమాను ఆచంద్రార్కము నిచ్చె॥ స్వదత్తం పరదత్తంవా యోహరేతి
వసుంధరాం షష్టివర్ష సహస్రాణి విష్టాయాంజాయ

9 తేక్రిమి॥ ఈ నిమిత్యముననే శ్రీ త్రిపురాంతక దేవరకు అఖండ దీపమునకు నామదేవని ఇచ్చిన
మొదవులు 40 వీనిం

10 జేకొని బాలిసెట్టి బాలమ నిత్య మానెండు నేతి లెఖను తన వంశాను పరంపర నడుపువారు

—o—

